# బాపురెడ్డి
# సాహితీ సమాలోచనం

( బాపురెడ్డి సాహితీ రజతోత్సవ ప్రచురణ )


రచన:

**కర్రా కార్తికేయ శర్మ**



ప్రచురణ:

**వంశీ ఆర్ట్ థియేటర్స్**

న్యూ నల్లకుంట, హైదరాబాదు-500 044

( ఫోన్ నెం. 61001 / 63213 )

## బాపురెడ్డి

# సాహితీ సమాలోచనం

( బాపురెడ్డి సాహితీ రజతోత్సవ ప్రచురణ )


రచన:

## కర్రా కార్తికేయ శర్మ



ప్రచురణ :

## వంశీ ఆర్ట్ థియేటర్స్

న్యూ నల్లకుంట, హైదరాబాదు-500 044

( ఫోన్ నెం. 61001 / 63213 )

Bapu Reddy Sahitee Samalochana
Written by Sri Karra Kartikeya Sarma

ప్రథమ ప్రచురణ :
1980, డిశంబరు.
కాపీలు 2,000



ముఖపత్ర రచన :
శ్రీ శీలా వీర్రాజు

ముఖపత్ర ముద్రణ :
గీతా ప్రింటర్సు,
కాచిగూడా, హైదరాబాదు

ముద్రణ:
స్నేహలతా ప్రింటర్సు,
కాచిగూడ, హైదరాబాదు

కాపీలు దొరుకుచోటు :
బుక్‌హౌస్, నారాయణగూడ
రాబాదు-500 027

వెల : రూ. 8-00

# మరో మెట్టు

వంశీ ఆర్ట్సు నుంచి వెలువడుతున్న మరో అందమైన పుస్తకం "బాపురెడ్డి సాహితీ సమాలోచనం". శ్రీ కర్రా కార్తికేయశర్మగారు బాపు రెడ్డిగారి కవితా ఔచిత్యాన్ని ఉన్నతంగా స్పష్టించి, నేటి కవులలో బాపు రెడ్డిగారి స్థానాన్ని చిత్రించారు. ప్రత్యేకంగా అడిగి వ్రాయించిన పుస్తకం కాదు ఇది. బాపురెడ్డిగారిరచనలకు పరవశమై శ్రీ శర్మగారు అడగకుండా చాలాకాలం క్రితం వ్రాసింది. ఈ కాలంలో అడిగి వ్రాయించటం జరిగితే, ప్రముఖ కవులనే అందరు అడుగుతారు.

తన మీద ప్రేమతో శ్రీ శర్మగారు రచించిన ఈ పుస్తకాన్ని తన సాహితీ రజతోత్సవం సందర్భంగా ప్రచురిస్తే బాగుంటుందని శ్రీ బాపురెడ్డిగారు 'వంశీ' సంస్థకు అదృష్టం దక్కించారు. 'వంశీ'కి ఈఅదృష్టం లభించేటట్లు డా॥ జి. వి. సుబ్రహ్మణ్యంగారు చేయూతనిచ్చి సాయపడ్డారు.

వంశీ నిర్వహించే ప్రతి కార్యక్రమం వృధాకాకుండా, ప్రతిసారి ఇలాంటి పుస్తకాలు రావటం, వంశీ పురోభివృద్ధికి దోహదం చేస్తాయని మా విశ్వాసం.

బాపురెడ్డి సాహితీ రజతోత్సవం రోజు ఈ పుస్తకాన్ని ఆవిష్కరిస్తున్న డా. సి. నారాయణరెడ్డిగారికి వంశీ వందనాలు తెలియచేస్తున్నది.

ముందు తరాల వారికి కూడా బాపురెడ్డిగారి గురించి చాటిచెప్పే ఈ పుస్తకాన్ని మీ కందిస్తున్నందుకు వంశీ సంస్థ గర్విస్తున్నది.

మీ అందరి సహకారం ఎల్ల వేళల ఆశించే

28-12-80
హైదరాబాదు-500 044

**వంశీ రామరాజు**
ప్రధాన కార్యదర్శి

# కృతజ్ఞతాంజలి!

కవితకు వెలకట్టడం, కవితను కట్టడం
ఉగ్గుపాల నాడే నేర్పి-
లోకంలోని తండ్రులందరి కన్న విలక్షణంగా
కవిగా, విమర్శకుడిగా, వక్తగా
నన్ను తీర్చి దిద్ది-
ఈ శరీరంలోని ప్రతి అణువూ
సాహిత్యమన్న స్పందించే విధంగా
తన సాహిత్య సంపదకు వారసుడిగా
నన్ను పెంచి పెద్ద చేసిన
ప్రముఖ సాహితీవేత్త
మా నాన్నగారు
**శ్రీ కత్రా చంద్రశేఖర శాస్త్రిగారికి**
నా కృతజ్ఞతాంజలి!

ఊట్ల
23-12-80

కత్రా కార్తికేయశర్మ

# అక్షర శిల్పి బాపురెడ్డి

కరీంనగర్ జిల్లా 'సిరికొండ' లో పుట్టి, ప్రశాంతమైన పల్లీయ జీవనాన్ని గడిపి, ఆంధ్ర కవిత్వ రంగాన్ని మెట్టి, రాజనాలు పండించి-ఆంధ్రులందరిచేత ఉపద లందుకొంటున్న మధురమైన కవి శ్రీ జె. బాపు రెడ్డి. వచన కవిత వ్రాసినా, పద్యకవిత చెప్పినా, గేయాన్ని చెక్కినా, గేయనాటికను విరచించినా, ఒకానొక మధురిమను, నవ్యతను వాటి యందు పొదగడం బాపురెడ్డికి వెన్నతోటి విద్య !. కర్షకజీవితంనుండి కలెక్టరు జీవితం వరకూ ఆయన అనతికాలంలోనే ఎదిగిపోయారంటే ఆయన కృషి ఎంత దృఢమైనదో ఊహించవచ్చు. 'చైతన్య రేఖలు' కవిగా తెలుగువారికి పరిచయమై 'అనంత సత్యాలు'కవిగా పరిణతి సాధించారంటే ఆయన కవితా సాధన ఎంత తీవ్రమైనదో అంచనా కట్టవచ్చు.

నినాదాలే కవిత్వాలుగా, వట్టిమాటలే మహాకావ్యాలుగా చెల్లుబాటు అవుతున్న నేటి రోజులలో బాపురెడ్డి కవిత్వం దప్పికగొన్న సాహితీ యాత్రికుని తృప్తిపరిచే చలివేంద్రం ! క్లుప్తత, స్పష్టత, నవ్యత, మానవత, నిరాడంబరత శ్రీ రెడ్డి కవిత్వానికి పంచప్రాణాలు ! వాడుక పదాలనే ఆయన స్వీకరించి, కవితలో ఇరికించి అందంగా ముస్తాబు చేస్తారు.

"నీవు పాడియు పాడించినావు నన్ను
నీవు ఆడియు ఆడించినావు నన్ను
భావములు నావి పాటలో భాష నీది
ప్రేరణము నాది నాట్యాల రీతి నీది" అంటూ ప్రణయ జీవిగా, స్నేహ శీలిల్లా తృప్తిని ప్రకటించినా,

"దళిత జీవిత విప

త్కాల గానము ప్రియా

శరణాగతుడ నేను

కరుణించి రక్షించు" అంటూ ప్రేమభక్తుడిగా ఆవేదనను అనుభవించినా,

'స్వార్థంతో సంబంధాలు త్రెంచుకొని

సకలగ్రహాలతో బాంధవ్యం పెంచుకొని

సృష్టిసర్వాన్ని ఒకే

శాశ్వతానందసూత్రంతో

సంధిద్దాం" అంటూ విశ్వలోక కుటుంబి వలె సమైక్యతను ఆశించినా – ఆధునికత ఆయన కవితలో జీవవాహికగా ప్రవహించడం గమనార్హం !

'మన చేవను చంపిందిరా కులం

మన చరిత్రను మలినం చేసిందిరా కులం

మన సమాజ దురాచార కారణం కులం

తరతరాల దారిద్ర్యాల కారణం కులం' అంటూ కుల వ్యవస్థపై క్రోధాన్ని వ్యక్తపరిచినా,

'ప్రేమ రథం

భాగ్య పథం

మీద సాగి పోవాలి

పేదరాలి

భాగ్యశాలి

మధ్య తెరలు తొలగాలి' అంటూ అభ్యుదయాన్ని ఆకాంక్షించినా 'శిల్పాన్ని' వదలని గడుసరి బాపురెడ్డి.

కవి సమాజంలో ఒకడు గనుక సమాజానికై ఉద్దేశింపబడిన ఉద్యమాలలో అతడి పాత్ర ప్రముఖమైనది. ప్రజలకై ప్రభుత్వం ఏర్ప

రచే ప్రతి మంచిపనిలోను అతడు తప్పక ఉంటాడు. గిరిగీసుకునే తత్వం ప్రజాకవికి విరుద్ధం.

'నిన్న పొదుపు చేసుకుంటే
నేడు లేదురా దుఃఖం
నేడు పొదుపు చేసుకుంటే
రేపు కలుగుతుంది సుఖం' అని "పొదుపు" ఆవశ్య

కతను,

'సంతానాన్ని నిరోధించడం అంటే
సౌభాగ్యాన్ని పెంచడం
కుటుంబనియంత్రణ అంటే
మానవకుటుంబానికి
అమృతం పంచటం' అంటూ కుటుంబ నియంత్రణ' అవసరాన్ని కవితలలో విప్పి చెబుతున్నారు బాపురెడ్డి. అంతమాత్రం చేత అస్థిరమైన కవితలు నిర్మిస్తున్నారని అంటే అది సత్యదూరమే అవుతుంది.

ఇతివృత్తం ఏదయినా దర్శించే దర్శనంలో కవిత్వం యొక్క ఆయుష్షు నిర్ణయింపబడుతుంది. దర్శనం పేలవమైతే కవిత తక్కువ జీవితం గడుపుతుంది. దర్శనం దివ్యమైనదైతే కవిత దీర్ఘకాలం బ్రతుకు కుంది. ఈ రహస్యం బాపురెడ్డికి తెలుసు.

కవిత్వమంటే పకోడీలు తినిపారవేసే కాగితం వంటిది కాదు. మనస్సును దోచుకున్న ప్రియురాలు ఆప్యాయతతో వ్రాసిన ప్రేమలేఖ వంటిది. చనిపోతున్న యుద్ధవీరుడు రక్తంతో చేసిన సంతకం వంటిది. పిడికెళ్ళ చైతన్యంతో అరిచే అరుపువంటిది. ఇంకా చల్లని వెన్నెల వంటిది, తెల్లని వెల్లువ వంటిది. నగ్నంగా నర్తించే భావాలకు గజ్జలుకట్టి అక్షరాలతో వలువలుచుట్టి సర్వాంగ సుందరంగా తీర్చిదిద్దవలసిన బాధ్యత

కవిది. ఆ బాధ్యతను కవి ఏమాత్రం నెరవేర్చకపోయినా కవిత వికృతా కారంతో నడిరోడ్డున పడి హేళనకు గురయ్యే ప్రమాదముంది. ఈ దృష్టితో బాపురెడ్డి కవిత్వాన్ని పరిశీలించిననాడు కవిగా ఆయన తన బాధ్యతను పూర్తిగా నెరవేర్చారని మనకు స్పష్టమౌతుం.ది

చెల్లాచెదురుగా పడిఉన్న భావాలను అక్షరాలను క్రమపద్ధతిలో పేర్చేవాడు కవి. ఆ 'కంపోజింగ్ వర్క్' నే మనం కవిత్వంగా పిలుస్తాం. ఎన్నో రకాల కవిత్వాలు నిరంతరం మనల్ని పలుకరిస్తాయి. ఏడాది కోసారి ఎదురయ్యే ఆప్తమిత్రుడిలా కొన్నికవిత్వాలు మాత్రమే మనల్ని అలరిస్తాయి. ఆ కోవకు చెందినది బాపురెడ్డి కవిత్వం. పది కాలాలు మనం గుర్తుంచుకునే సౌందర్యమయమైనది బాపురెడ్డిభావుకత్వం.

## 'మాటలతో గీసిన మానవతా చిత్రాలు'

# బాపురెడ్డి గద్య కావ్యాలు

కవిత్వం వ్రాయడమంటే ఎంతోతేలిక అనిపిస్తుంది కొందరికి. వారు కవిత్వాన్ని మంచినీళ్ళప్రాయంగా భావిస్తారు. ఒకవిధంగా నేటి కవిత్వరంగం వారి అభిప్రాయాన్ని స్థిరపరిచేదిగా కనిపిస్తోంది. జట్లు జట్లుగా కవులు చేరి 'కవితా సంకలనాలు' ప్రకటించడం, తెలుగురాయడం చదవడం వచ్చిన ప్రతిబుద్ధిమంతుడు అడ్డంగానో నిలువుగానో కొన్ని పదాలు పేర్చి కవిగా ముద్రవేసుకోవడం, ఆర్థికస్తోమత ఉంటే - ప్రముఖుల పీఠికలు జతపరుస్తూ వాటిని అచ్చొత్తించడం. ఇట్లావెలుగులోకి వచ్చిన వందలకొలదీ సంపుటాలు తెలుగుకవిత్వరంగాన్ని కప్పెయ్యడం లాంటి వాస్తవాలను దర్శించిన ప్రతివాడికీ కవిత్వం అంగట్లో దొరికే బెల్లంలా కనుపించవచ్చు. తప్పు లేదు.

కాని, అందరికీ లభ్యంకాని భావాలు కొందరిలో మెరుపుల్లా మెరుస్తాయి. వాటిని వారు కవిత్వంలో వదిలవరిచి జనతకు అందిస్తారు. వారి కవిత్వం జనతలో పేరుకున్న జడత్వాన్ని పారద్రోలి చైతన్య వికాసానికి తోడ్పడుతుంది. అలా నూతనత్వానికి నాందిపలికేదే కవిత్వం! ఎన్నోరాత్రులు ఆ కవితా ప్రసవానికి నొప్పులు పడ్డవాడే కవి !

శ్రీ బాపురెడ్డి కవి అంటే చాలదు. మంచికవి. కవిత్వం మంచిగంధం వంటిది. నిజాన్ని చూపే అద్దంవంటిది. ఆ పరిమళాన్ని ఆఘ్రాణిస్తూ, ఆ నిజాలను దర్శించడం ఒక అనుభవం !

'సింహాచలం కొండల' ప్రక్కన
చల్లని పిల్లగాడుపులు సేవిస్తూ
ప్రక్కనున్న సాగర సంగీతంతో
పరవశమై తేలిపోయే
నిత్యనూతన సముల్లాసిని
విశాఖపట్నం సుహాసిని ! '—ఈ ఆరు పాదాల్లోను

విశాఖపట్నం బొమ్మగీసి చూపించారు బాపురెడ్డి. నిజజీవితంలో రెడ్డి ఔదార్యవంతులైనా కవిజీవితంలో మాత్రం 'పదాల పొదుపరి'! అవసరాన్ని మించిన పదం వీరికవిత్వంలో మనం ఎక్కడోకాని చూడం. తెలుగు కవితారంగంలో తిక్కన, వేమన, గురజాడ, శ్రీ శ్రీ- వీరే పదాలను పొదుపుగా వాడేరు. వారి తరువాత పదాల పొదుపులో బాపురెడ్డిని పేర్కొనవచ్చు.

'విశాఖపట్నం జీవితం
విచిత్రంగా ఉంటుంది.
అందమైన పరిసరాలు
అవసరమైన సరదాలు
అన్నీ ఉన్నాయిగాని—
పచ్చనోట్లు జేబులో ఉంటేనేగాని
పచ్చిమంచినీళ్ళు కూడా పుట్టవు ఇక్కడ !

కవి సౌందర్యాన్ని వర్ణిస్తూనే అసౌకర్యాన్ని కూడా వివరించాలి. "లోకంలో బాధలన్నవి లేవు అంతా ఆనందమయమే!' అన్నా, 'లోకంలో ఆనందం లేదు అంతా బాధలనిలయమే!'అనినా, ఆకవి సత్యవాది కాదన్న విషయం స్పష్టమౌతుంది. మరి సత్యాన్ని విస్మరించిన కవి ఉదయించని రవివంటివాడు.

విశాఖపట్నం సౌందర్యానికి తన్మయుడైన బాపురెడ్డి అక్కడనున్న 'ఇరుకు' తత్వానికి నిష్ఠూరుస్తున్నారు.

'కూడు సమస్యకంటే ఇక్కడ
గూడు సమస్యే దొడ్డది.
పెరిగిపోతున్న జనాభా తెచ్చిన
పెద్ద సమస్యల్లో కల్లా పెద్దది' అని

బాపురెడ్డి కలంలో పడి కవితగా మారి ధన్యమైంది విశాఖపట్నం.

ఇక కుక్కను కావ్యవస్తువుగా తీసుకొని నవ్యతను సాధించారు కవి. ప్రతిరోజూ మనం 'ఛీ' కొడుతున్నా 'జే' కొట్టవలసిన జంతువు కుక్క !

'నమ్మిన వాళ్ళను మోసగించడం
న్యాయం అయిపోయిన ఈ రోజుల్లో
అన్యాయానికి
న్యాయం అర్పిస్తున్నావా ?
అవిశ్వాసానికి
విశ్వాసం సమర్పిస్తున్నావా ?
క్రూరమృగాలకు
చోరమృగాలకు
శత్రుడవు నీవు,
కృతఘ్నలోకానికిసైతం
కృతజ్ఞత చూపే

మిత్రుడవు నీవు !' అంటూ కుక్క విశ్వాసాన్ని శ్లాఘిస్తున్నారు. "కాదేదీ కవిత కనర్హం" నిజమే ! కాని? ఆ "అనర్హత"ను అర్హతగా మార్చడంలో కవి శక్తిమంతుడు కావాలి ! ఈ ఖండిక బాపురెడ్డి శక్తికి అద్దంపడుతోంది.

'ఒక పుట'అనేకవిత అప్పటికప్పుడు చెప్పినదే అయినా "త్వర" లేని కవిత.

"జననం ఒకపుట
మరణం ఒకపుట
మానవ జీవిత పత్రాలకు' అంటూ వైరాగ్యాన్ని నవ్యంగా వినిపిస్తున్నారు.

'ఒక పుట గల పత్రం లేదు
ఒకే తీరం గల నది లేదు
ఒకటే ఒకటి ఏదీ లేదు
సకలం ఆమ్రేడితం
దేవుడుకూడా ఒంటరి కాదు
దేవీ సమేతుడు'

నిరాడంబరంగా ప్రారంభమై నగ్నసత్య ప్రసవంతో హుందాగా పరిసమాప్తికావడం ఈ కవిత ప్రత్యేకత !

రసజ్ఞుడిగా విజ్ఞప్తి చేస్తున్నారు కవి——
'గాడిద మీద మూటలు మోయించినట్లు
కవితలో మాటలు మోయించకు
బాలపల్లవకోమలవాగ్దేవితో
బస్కీలు వేయించకు, కుస్తీలు పట్టించకు!'

ఈ నాలుగు పాదాలతో బాపురెడ్డి కవిత్వ తత్వం మనకు బోధపడుతుంది. ఈనాటి కవులందరికీ ఈ పాదాలు శిరోధార్యాలు! నల్లసిరా తెల్లని కాగితాలు పుష్కలంగా ఉన్నాయి. మెదడులో భావాలు, పదాలు సమృద్ధిగా ఉన్నాయి. ఏది రాసినా చదివేజనం సాహిత్యరంగంలో దండిగా ఉన్నారని కవిత్వం బళ్ళ కెత్తిస్తే ఏంజరుగుతుందో గతకాలపు కవిత్వ రంగాన్ని ప్రశ్నిస్తే అది చెబుతుంది చేదైన సత్యాలను.

వందలకొలదీ కవులు కాలూనిన పూర్వాంధ్ర కవిత్వరంగంలో, నిలిచిన కవులు పదులు మాత్రమే ! మిగిలిన వారందరూ కవితా దురంధురులే అయినా 'అనామికలు'గా మిగిలిపోయారు. దానికి కారణం ఏమిటి ? అంధానుకరణ, కృత్రిమభాషాభేషజం, వెరసి పాషాణ పాక కవిత్వం !

ఆధునిక కవిత్వం కూడా 'చరిత్ర పునరావృతం' అన్నట్లే ఉంది. వందల సంఖ్య నుండి వేలసంఖ్య వరకు కవులు పెరుగుతున్నారు; కావ్యాలు వస్తున్నాయి. ఎన్ని కవితలు నిలుస్తున్నాయి ? మరెన్ని గాలిలో తేలిపోతున్నాయి ? పరిశీలించండి. గుండె గోదావరిలా ద్రవించిపోతుంది.

కవు లెవరైనా ఈ విషయాన్ని గ్రహిస్తున్నారా ? గ్రహిస్తే కవిత్వతత్వం మారకట్లేదేం ? ఇంకా శ్రీ శ్రీ పదచిత్రాలు యువ కవుల కవితల్లో దర్శన మిస్తూనే ఉన్నాయి. సి. నారాయణరెడ్డి గొంతుక వందల యువగళాల్లో ప్రతిధ్వనిగా వినిపిస్తూనే ఉంది. దాశరథి క్రోధం యువ కవుల క్రోధంగా కవితల్లో ప్రాకుతూనే ఉంది. ఆరుద్ర "టెక్నిక్" ఈనాటి కవుల్లో "స్ఫుత్నిక్" లా ప్రయాణిస్తూనే ఉంది. ఇంకా కుందుర్తి, కాళోజీ, నారాయణబాబు, కొంతవరకు శేషేంద్ర-కవిత్వంలో కొందరిపై పెత్తనం చేస్తూనే ఉన్నారు. కవులు స్వతంత్రంగా, సొంతగొంతుకతో తమవైన "ముద్రల"తో ఎప్పుడు బయటకొస్తారు ? ఎప్పుడు ఈ కవిత్వం జీవనదిలా ప్రవహిస్తుంది ? ఈ ప్రశ్నలకు కదిలే కాలమే జవాబు చెప్పాలి. ఒక్కటి మాత్రం నిజం. రాజకీయాలతో మనిషికి సన్నిహిత సంబంధమున్నా-ఆ మనిషి కవి అయితే మాత్రం వాటికి దూరంగా ఉండాలి. నిజజీవితంలో నినాదాలను ప్రేమించే వాడైనా కవిజీవితంలో వాటిని బహిష్కరించాలి. అప్పుడు నిజమైన కవిత్వం, కొన్ని శతాబ్దాలు చూడగలిగే కవిత్వం తప్పక వస్తుంది. అంతవరకూ బాపురెడ్డి అన్నట్లు

'భావం అనే కళ్లెం త్రెంపుకొని
పరుగెత్తే మాటల కవిత్వపు గుర్రం
కలిగించేది కాదు రసానుభూతి
కళ్ళూ ఒళ్ళూ మండించే
ధూళి ధూసర విభూతి'

'అంతరిక్ష పర్వం' ఒక చక్కని కవిత. బాపురెడ్డి హృదయ కేదారంలో పండిన పచ్చని మమత.

"పందొమ్మిది వందల అరవై తొమ్మిది
జూలై ఇరువై ఒక్కటి నాడు
ప్రాణకోటి చరిత్రలో
ప్రప్రథమంగా మానవుడు
పాదం మోపినాడు
చంద్రలోకంమీద'—అంటూ మానవ విజయాన్ని అభినందిస్తూనే-నరలోకంలోని మూఢాచారాలకు భరతవాక్యం పలకాలని, అలా జరిగిననాడే ఏ విజయానికైనా చరితార్థత ఏర్పడుతుందని లేకుంటే

'చేతులు జనరక్తంలో తడిపి
కాళ్ళు చంద్రలోకం మీద పెడితే
అస్పృశ్యగ్రహాలను స్పృశించి
అస్పృశ్యు లని అనాథలను బహిష్కరిస్తే
చర్వితచర్వణమే అవుతుంది
మానవ చరిత్ర' అని ఈ కవితలో తన పదునైన భావనను వ్యక్తపరిచారు. 'ఆర్మ్‌స్ట్రాంగ్' కూడా ఈ సత్యానికి తల వంచాలి తప్పదు.

'ఎకనామిక్సు సుందరి' అనే కవిత బాపురెడ్డి మాత్రమే చేయ తగ్గ కవిత. ఉస్మానియా యూనివర్సిటీలో యం. ఏ., ఎకనామిక్స్ విద్య

నభ్యసించే రోజుల్లోనే రెడ్డిహృదయంలో ఈ సుందరి చోటుచేసుకొని ఉండవచ్చు. శ్రీ బోయిభీమన్న అన్నట్లు 'సకల సౌందర్యాలకూ, సమస్త సుందరీ మణులకు, రాగాలకూ భోగాలకూ సంగమస్థానం ఈ "ఏకనామిక్సు సుందరి".

"వసంతాన్ని
ఓ యూనిట్‌గా తీసుకున్నా-
ప్రేయసీ !
నేను చేస్తున్న
నీ అధరసుధా కన్‌సంప్షన్
లా ఆఫ్ డిమినిషింగ్ యుటిలిటీకే
ఓ ఎక్స్‌ప్షన్".

అంటూ ప్రారంభమై "మార్జినల్ యుటిలిటీ" మరీ దాటి పోతే "మైనస్ యుటిలిటీ" మీద పడుతుందని క్లుప్తంగా కవితను ముగించడం జరిగింది. ఆర్థికశాస్త్రాన్నికూడా అందంగా సుందరిరూపంగా భావించి కవిత చెప్పిన ఘనత బాపురెడ్డికి దక్కింది.

బాపురెడ్డి విదేశయాత్రానుభూతులు చక్కనివి చిక్కనివి. ఆ కవితలు పఠిస్తుంటే- ఆప్రాంతాలలో మనం విహరించినట్లుంటుంది. 'ఏథెన్సులో ఆరంభించి, మా ఇంటిలో ముగించాలనుకున్నాను' అంటూ అన్నంతపని చేశారు.

'ఏథన్సులో అరుణోదయం'—

"అక్షరాల కందని అందంతో
సూర్యబింబం ఉదయించింది"

'పూలబాల హాలండ్'—

"పూలు చూడాలంటే
హాలండ్ చూడాలి

హాలండ్ చూడాలంటే
ఐరోపా చూడాలి"

'చేప కన్నెల స్కాండినేవియా'—

"స్కాండినేవియాను చూచి
స్పందించని వాడుండడు
అక్కడ కవిత్వం రాయలేనివాడు
ఎక్కడా కవి కాలేడు"

'లండన్ దీపం'

"షేక్స్పియర్, షెల్లీ, కీట్సు
వర్డ్సువర్తు, గోల్డుస్మిత్, బైరన్
జాన్సన్, బర్నార్డ్ షా వంటి
సాహితీ స్రవంతులు
తత్త్వ చింతనా సాగరులు
వెలసిన ఇంగ్లడు ద్వీపం
చరిత్రలో ఆరని దీపం'

'ప్యారిస్ మయూరి' –

'చక్కని చిలకలాగ
చక్కెర బొమ్మలాగ
ఎటుపోయినా హాయిగా
ఏది చూచినా తీయగా
ఉంది అందాల ప్యారిస్‌నగరం
డెందం ఉన్నవాళ్ళకు దేవుడిచ్చినవరం'.

'కన్నీటిలో వాటర్‌లూ'–

"బెల్జియంలో చూడదగ్గది
వాటర్‌లూ ఒక్కటే

ఆఒక్కటి చూడడానికైనా
ఆదేశం పోయిరావాలి".

"ధర్మవేణి జర్మనీ"-
"నిర్మూలన పథాన్ని గతాన్ని వదలి
నిర్మాణపథాల భావిరథాల కదలి
చేతనా కేతనాలు ఎగురవేసే
జీవ కళా విలాసిని
జర్మనీ ధర్మవేణి నేడు".

"స్వేదం మోదం కలసిన చెకొస్లొవేకియా"-
"పొట్టనిండా తినాలీ అంటే
పుష్కలంగా తాగాలీ అంటే
ఆభరణాలు అలంకారాలు లేని
అచ్ఛమైన అందాలు చూడాలంటే
నావంటి పేదవాళ్ళకు
నాకం చెకొస్లొవేకియా'.

"భూలోకసుందరి స్విట్జర్‌లాండ్'-
"జలక మాడే పేటికొలనుల
అందాలు ఆరబోసిన
సుందరభూమి స్విట్జర్‌లాండ్'.

"కాల కేళీరంగం రోంనగరం'-
"రోంనగర చరిత్రాస్మృతి
రోమాంచం కలిగిస్తుంది
ప్రతిశిథిల శిల్ప సౌందర్యరేఖ
ఏదో మహాకావ్యం వినిపిస్తుంది".

ఈ విధంగా తన విదేశయాత్రానుభవాలను అక్షరాలలో అందంగా, శాశ్వతంగా పొందుపరిచారు బాపురెడ్డి. విదేశాలలో పర్యటించే అవకాశం అదృష్టం అందరికీ కలగదు. కలిగినా ఆ అనుభవాలను అందమైన కవిత్వాలుగా మార్చేశక్తి ఉండడం కద్దు. బాపురెడ్డి అద్భుతమైన కల్పనాశక్తి గల కమ్మనికవి. ఈయన చేసిన విదేశ యాత్ర సుందర కవిత్వ పాత్ర!

అన్నిదేశాలు సంచరించినా పల్లెటూరిని, ప్రాణేశ్వరిని, మరచిపోలేదు కవి.

"మళ్ళీ మాపల్లెటూరు చేరుకున్నాను.
పల్లెటూరిలో నాకోసం పదినెలలు
పల్లేరుకాయల పరుపుమీద
పలుప్రమల్లెలదండ అల్లుకొన్న
ప్రాణేశ్వరి పరిష్వంగంలో
వాలిపోయాను' అంటారు. ఈ పాదాల గర్భంలో ఎంత తృప్తి దాగుంది!

అంబేద్కర్ దళితజాతులకు ఆశాజ్యోతి. భారతరాజ్యాంగ నిర్మాత. మేధావి. ఆయన వ్యక్తి కాదు; వ్యష్టి, సమిష్టి, సామూహికశక్తి. ఆయన మేధస్సు సాగరంతో సరిపోల్చ తగ్గది. ఆయనజీవితం దేశప్రగతికి అంకితమైనట్టిది. అట్టిమనీషిని "అంబేద్కర్ శరణం గచ్ఛామి" అంటూ స్మరిస్తున్నారు బాపురెడ్డి.

"చైతన్య మహానదివై
భరతఖండంనిండా ఆవరించిననీవు
శిలవైపోయావా!' అని ఆయనస్మృతికి పరితపిస్తునే

'మళ్ళీ ఒకసారి అవతరించు అంబేద్కర్' అంటూ ఆయన పట్ల తనకున్న భక్తిని ప్రస్ఫుటంచేశారు బాపురెడ్డి. రెడ్డివంటి మానవతావాద

మాత్రమే ఈ మాటలు అనగలరు. ఈమాటలవెనుక అంబేద్కర్ కృషి ఈసమాజానికి మరింత అవసరమన్న ధ్వని వినబడుతోంది.

ఈమధ్య కాలంలో ఈ కవిత ఎంత ప్రచారాన్ని పొందిందో వివరిస్తున్నాను.

సాధారణంగా తెలుగు కవిత్వంలో ప్రయోగం బయలుదేరిందంటే సినిమా విడుదలరోజున కిక్కిరిసిన జనంలా కవులుపోటీలు పడటం మనం ఎరుగున్న సత్యమే! "మళ్ళీ ఒక్కసారి అవతరించు అంబేద్కర్" ఇవి స్థూలదృష్టికి సామాన్యమైన మాటల్లా కనబడ్డా ఈమాటల్ని కవులెందరో సొంతంచేసుకున్నారు.

మళ్ళీ ఒకసారి అవతరించు కందుకూరీ! అని ఒకకవి,

మళ్ళీ ఒక్కసారి అవతరించ గలవా గురజాడా! అంటూ మరోకవి,

మళ్ళీ ఒక్కసారి అవతరించు బాపూ! అంటూ ఇంకొకకవి-ప్రతిభనుబట్టి ఇష్టాన్నిబట్టి బాపురెడ్డివాక్యాన్ని వినియోగించుకోవడం జరిగింది. పదిమంది కవులను తనప్రయోగాలచుట్టూ త్రిప్పుకొనే కవి సామాన్యుడా? అఖండుడు. బాపురెడ్డి కవిత్వం అఖండం.

ఆర్ద్రిత ఆవేదన, మమత సమత, మానవత్వం నూతనత్వం, బాపురెడ్డి కవిత్వానికి ఆభరణాలు. ఆఆభరణాలను దాల్చిన మానవతా చిత్రాలే ఈగద్య కావ్యాలు.

‘లలిత కవితా సౌరభాలు’

# బాపురెడ్డి గేయాలు

ఈనాడు ఏ వారపత్రిక తెరిచినా, ఏదినపత్రిక పుటలు త్రిప్పినా బాపురెడ్డి కవిత దర్శనమిస్తున్నది. వృత్తిరీత్యా ఆయన మెదక్ జిల్లా కలెక్టరు. ప్రవృత్తిరీత్యా విరామ మెరుగని సాహిత్యశ్రామికుడు. వచనకవిత, పద్యకవిత, గేయం ఆయనకు ఊడిగంచేస్తునాయి. కవిజీవితప్రారంభంలో వీటికై ఆయన తపనతో కూడిన కృషి చేశారు. ఇప్పుడు వాటిని తనకనుసన్నల అదుపులో పట్టిఉంచారు. ఆయన వచన కవిత చైతన్యపతాక. గేయం రాగరంజితం. పద్యం గతవైభవవిలాసం. ఆయన రచించిన గేయ రూపకాలు గాయకుల గాత్రాలకు మాధుర్యాన్ని పంచి, ఆకాశవాణి ప్రతిష్ఠను పెంచాయి.

శ్రీ బాపురెడ్డి 1936వ సంవత్సరములో ఆంధ్రప్రదేశ్‌లోని కరీంనగర్ జిల్లా సిరిసిల్లా తాలుక సిరికొండగ్రామంలో జన్మించారు. ఆగ్రామం ప్రకృతి సౌందర్యమునకు పుట్టినిల్లు అగుటవలనను, అందు బాపురెడ్డి పసిపాపగా‘ఆఆ’లు దిద్దుకొనుటవలనను, ప్రకృతిసౌందర్యం ఆయనకవితలో ‘అనుకోని అతిథి’ గా ప్రవేశించడం జరిగింది. కవిగారి మనస్సు, పై ప్రకృతి ప్రభావం ఎక్కువగుటవలనే అన్యాయాన్ని ఎదిరించడం న్యాయాన్ని సమర్థించడం ఉగ్గుపాలవిద్యగా అలవరుచుకున్నారు. కవిత్వం ఆ కవి మనస్తత్వానికి అద్దంగనుక ఆయన కవిత్వంలో న్యాయాన్ని, స్వచ్ఛతని, నిరాడంబరతను ఎక్కువగా మనం దర్శిస్తాం.

‘ఎవరికోసం నేను
ఇల కవతరించానో?
ఎవరికై ఈ బ్రతుకు
చివ్వుకనీకున్నానో

ఎవరికై కలలు రే
బవలు కంటున్నానో?
ఎవరికై ప్రతిది పా
టే అల్లి పాడుదునో?

'ఎవరికోసం' అన్నప్పుడు సందర్భాన్నిబట్టి ప్రేయసికావచ్చు- కవి హృదయాన్ని 'ఎక్సరే'తీస్తే క్షుభితాత్ముడు కావచ్చు. బాపురెడ్డి గేయాలలో కొన్నిగేయాలు భావకవిగా ఆయనను పరిచయం చేస్తే- మరికొన్ని గేయాలు అరుణభావకవిగా సన్నిహితం చేస్తాయి.

భావకవిగా ఆయనను పరిచయం చేసేగేయాలను సమీక్షిద్దాం.

నీ కన్నుల వెలుతురులో
నే కన్నులు తెరిచాను
కనులు తెరచి నే నిది భూ
లోకమనే మరిచాను,

............................

............................

నీ కౌగిలి చేరినాను
నే కన్నులు మోడ్చినాను
లోకమ్మున కోటి కోటి
నాకమ్ములు చూచినాను. (నీవూ-నేను)

ఈ గేయంలో బాపురెడ్డి భావుకత్వం చదల ఎద చీల్చిందన్న అతిశయోక్తి లేదేమో! ఆమెకన్నుల వెలుతురులో కన్నులు తెరవటం, అతీతానందతన్మయత్వంలో ఊగులాడి ఇది భూలోకమనే విషయం మరచిపోవడం, ఆమెకౌగలి చేరి కన్నులు మోడ్చి లోకంలో కోటి కోటి నాకమ్ములు దర్శించడం ఉత్తమభావకవికి కలగే వేడి వేడి అనుభవాలు. ఆ అనుభవాల ప్రసవం సౌందర్య శిఖర అధిరోహణం!

3)

నవ వసంతానివై
అవతరించెద వంచు
నా బ్రతుకు తోట ని
న్నాళ్ళు పెంచితినే!
స్నేహానిలములతో
చిరునవ్వు విరులతో
విరహశిశిరమునుండి
విడిపించు నను చెలీ!'

వైఖండిక పరిశీలిస్తే సాధారణమగు భావకవిలో గూడుకట్టుకొన్న అమాయకపుతొందర కనిపిస్తుంది.

'ప్రేమ రసవృష్టి కురి
పింతు వని ఆశించి
యౌవనీ! నావిమల
యౌవన క్షేత్రాన
చల్లితిని మంజులా
శయ బీజముల నెన్నొ
ఈప్రవాసపు టనా
వృష్టి కడతేర్చవే!' (విపద్గీతి)

ఈపాదాలను సమీక్షిస్తే కవిలోని గడుసుపోకడ అలవోకగా నవ్వుతుంది. బాపురెడ్డి కవిత్వరహస్య మిదే! అందరికీ అందుబాటులో ఉన్నపదాలను ఏరుకొని కవిత కట్టి, అందరివాడిగా వ్యవహరిస్తునే శిల్పం విషయంలో గడుసుగా ప్రవర్తించి కొందరివాడిగా మారిపోతారు. అందుకే ఈనాడు తెలుగుదేశంలో బాపురెడ్డి కవిత్వానికి విపరీతమైన మోజు ఆదరణ. ఆయన హృదయంలో పొంగిన భావాలు అమాయకమైనవే అయినా, కలంలోకి ప్రవేశించి తెలివిగా మారి, కాగితంమీద రూపుదాల్చేసరికి రేడియం చుక్కల్లా మెరిసిపోతాయి.

'ఎన్నో ఊహలను, ఎన్నెన్నో అనుభూతులను
జీవనిర్భర భావచిత్రాల నిల్పు నా
కలము నీరూపసత్కళ జూచి తలవాల్చి
కంపించు తనగొంతు కదుపజాలదు దేవి!

..............................

అంగాంగమున సుధల పొంగి పారగనీదు
అధరపుష్పాన సంధ్యారుణిమ డాగెనా
యనిపించు, ఎడద భావనలేవొ వికసించు,
ఈ సృష్టి కర్థమ్ము ఈనాటికీ స్ఫురించు'(మహానుభూతి)

రమ్యాణివీక్ష్య మధురాంశ్చ నిశమ్యశబ్దాన్, అన్న కాళిదాసుశ్లోకం ఇక్కడ జ్ఞప్తికి వస్తోంది. రమ్యమైన దృశ్యం చూసినా. మధురమైనశబ్దం వినినా, మానవుడు సుఖవంతుడై ఉన్నప్పటికీ తీరనివేదనను అనుభవిస్తాడు, కాగా మన మనస్సున స్థిరపడ్డభావములు జన్మాంతర సంబంధ మైనట్టివి. ఆమెరూపలావణ్యం తిలకించిన కవిగారికలం, గొంతు కదపలేని స్థితికి వచ్చిందన్న - మూగతనంగా మనం భావించరాదు. అదొక సమాధిస్థితి- తపస్సాధన. ఆసాధనలో ఆమె అంగాంగమున ప్రవహించు సుధలు అధరపుష్పాన దాగిన సంధ్యారుణిమ సాక్షాత్కరించి సృష్టికి అర్థం అవగత మయింది. ఇంతకన్న ఏకవికైనా కావాలసిం దేముంది? రససిద్ధికి మించినా వరం కవి కింకేమీ లేదు.

ఇక అరుణ భావకవిగా ఆయనను సన్నిహితం చేసే గేయాలను మన మిప్పుడు పరిశీలిద్దాం.

'పద్యానికి గద్యానికి మధ్య
ప్రాచీనులు పెట్టిన గోడలు
నేడో రేపో పూర్తిగ
నేలకు పడిపోవచ్చు,
దేశానికి దేశానికి మధ్య
ద్వేషాలు పెంచేతత్వం
మాయమయే కాలమెంతో
దూరం లేదనవచ్చు'

ఈ ఖండికలు బాపురెడ్డి అరుణభావుకత్వానికి సాక్ష్యాలుగా నిలుస్తాయి.

ఆధునికకవి చూపు భవిష్యత్తుకు గురిపెట్టబడి ఉంటుంది. నిన్నను పునాదిగా చేసుకొని, నేడును వేదికగా నిర్మించుకొని రేపును ఆహ్వానించే మానవ ఋషి ఆధునికకవి.

ఒక శతాబ్దానంతర నరుం
డూహవలె నాకనుల మెరియును,
ఒక వినూత్న విచిత్ర జీవిత
మును క్షణము కన్పరచిపోవును

..........................

అదిగో ఇరువదియొక్క శతాబ్ద
మ్మందు మనిషి మహానుభావుడు!
చూడు మాతని బ్రతుకు ఎంతటి
సుందరమ్మో ప్రచలితమ్మో!'

పైపాదాలు పరిశీలిస్తే బాపురెడ్డి సుందరమైన క్రాంతత్రృష్టి మనకు అవగతమౌతుంది. మనిషిని మనీషిగా ఊహించి మందిరమెరుగని దేవుడుగా పూజించి, సంభావించడంకన్న గొప్ప భావన ఏంకావాలి?

ఢిల్లీలో ప్రతిపల్లెలో రా
జిల్లె నవ నిర్మాణ శోభలు.
గనులలో, క్షేత్రములలో కిం
కిణుల మ్రోసెను భాగ్యదేవత"

భారతదేశం అనగా బాపురెడ్డి హృదయం చంద్రోదయసాగరంలా పొంగిపోతుంది. ఈదేశపు అభివృద్ధికి, పురోగతికి ఆయన కనే కలలు ఎన్నో! ఎన్నెన్నో!

అయిదు అయిదడుగులుగ ముందుకు
అదుగో భారతజాతి సాగెను
కాంతి చిమ్మెడి దివ్యసీమలు
కానుపించెను కనులమేరల"

మనం స్వాతంత్ర్యాన్ని సంపాదించిన ఈ కొద్దికాలంలోనే ఈ అభివృద్ధిని సాధించాం. ఈఅభివృద్ధి వెనుక ప్రతిభారతీయుడి కృషి ఆంతో ఇంతో ఉంది. అయిదు అయిదుఅడుగులుగ ముందుకువేసి భారత జాతి పురోగమిస్తోంది. ఎక్కడికి ప్రస్థానం? కాంతి చిమ్మే దివ్యసీమలకు, శాంతి ఒరిసే సౌందర్య క్షేత్రములకు!

బాపురెడ్డికి భారతదేశపునేతలపట్ల ఎంతో గౌరవం, అభిమానం. ఆయన మాటల్లో చెప్పాలంటే ఒక చిరునవ్వుకు నేను సహస్రార్చనలు చేయగలను. ఒక నిర్మల హృదయానికి హారతిపట్టగలను. ఒక అనురాగ భావానికి అంజలి ఘటింపగలను. పవిత్రమైన మైత్రికోసం ప్రాణాలైనా ఇవ్వడానికి సిద్ధమే. అయితే అసురత్వాన్ని అన్నివిధాల అడ్డగించగలను' అలా అసురత్వపు నిర్మూలనకు ఫర్మానా జారీ చేసిన నాయకులు బాపురెడ్డి ప్రియతములు. అందుకే నెహ్రూ మృతికి వ్యథ చెందిన కవి హృదయం.

ఓ భారతదేశ మూల స్తంభమా!
ఓ మానవజాతి శాంతి బింబమా!
ఒరిగి పోయితివా నేడు నేలకు!

తరలి పోయితివా స్వర్గసీమకు! అంటూ విలపించింది.
లాల్ బహదూర్ అస్తమయానికి

నడిరాతిరి నీ జాతిని
విడిపోయితివా!
ప్రతిగుండియలో దీపము
ఇడి పోయితివా! అంటూ శోకించింది.

టంగుటూరి ప్రకాశం జ్ఞప్తికి రాగానే

ఎవరయ్యా! నీ సరి
హే! ఆంధ్ర కేసరి
మరువదు నిన్ని దేశం

టంగుటూరి ప్రకాశం, అంటూ గర్వపడింది.

ఈస్మృతి కవితా పఠనంతో బాపురెడ్డి హృదయం, అందులోని ఆర్ద్రత మనకు అవగతమౌతుంది.

బాపురెడ్డి కవితావస్తువు విషయంలో పట్టింపులేనివారు, ఆడంబరానికి అర్రులు చాచనివారు. ఆయన ఎంత భాషాసంపన్నులో కవిత్వం విషయంలో అంత నిరాడంబరులు. ఎద కదలితే భావం రగిలితే కవిత మరాటాగుర్రంలా పరుగెత్తవలసిందే!

'పొట్ట మాడ్చుకొని నిన్ను
పొదుపు చేయ మనలేదు
కట్టుబట్టకోసమైన
ఖర్చు చేయ కనలేదు' అంటూ—

పొదుపుకై పిలుపు నిస్తున్నారు. ప్రజలకోసం కవిత్వంవ్రాస్తున్నాం అంటూనే ప్రజలకు అర్థం కాని భాషలో కవితలల్లే మహాకవులు ఎందరో ఉన్నారు. వారందరికీ వందనాలు! మనదేశం ఎదుర్కొనే సమస్యలు ఎన్నో ఉన్నాయి. మరి ఆ సమస్యలు కవిని కదిలించకా మానవు, కవితగా ఆవతారం దాల్చకమానవు. అంతమాత్రంచేత "కవిత్వం ప్రచార శాఖకాదు, సమాచార కేంద్రం కాదు' అంటూ వస్తువు విషయంలో గిరిగీసుకొని కూర్చోడం అభ్యుదయ కవికి వ్యతిరేకం. పొదుపన్నది ప్రతిమనిషికీ ఆవసరమే! పొదుపు లేని బ్రతుకు జీవితంలో ఎన్నో గతుకులనుఎదుర్కొనవలసి వస్తుంది. నేటి పొదుపే, రేపుకి మదుపు.

"భావి జీవితమ్ము కూడ
భద్రపరచు కొమ్మంటిని
నీదేశంకొరకు కొంత
నిన్ను సాయపడ మంటిని"

ఈ పొదుపువల్ల జీవితానికి భద్రం దేశానికి సౌభాగ్యం.

"పికవధూ! నీపాట విను ఓ
పిక రవంతయు లేదు నాకిక,
వినదలంచితి విశ్వమానవ
విజయగీతములు"- అంటూ సమాజాన్ని దర్శించే

"ఊప్స" ను వక్తపరుస్తున్నారు బాపురెడ్డి. సమాజావగాహన కవికి జీవ నాడి. గృహనిర్బంధంలో వ్రాసిన కవితకూ, సమాజం గుండెపై కూర్చుని వ్రాసేకవితకు ఎప్పుడూ తేడా ఉంటుంది. అనంద వనధిలో విహరిస్తున్నా పతితులను భ్రష్టులను మరచిపోని మనస్తత్వం మహాకవీ యానికి మంచి ప్రారంభం అనవచ్చు. కోకిలపాటకన్న మానవగీతమే గొప్పదిగా భావించే బాపురెడ్డి విరియని పేదబ్రతుకులను గూర్చి శ్రామిక, జీవుల కన్నులలో వెన్నెలను గూర్చి.మన సమాజజీవితము-దరిద్రజనావళికి భాగ్యోదయమును గూర్చి, ఎంతో ఆరాటన్ని కోరికను వ్యక్తపరిచారు. ఆయనకోరిక కమ్మగా ఈడేరే రోజుకోసం నిరీక్షిద్దాం!

ఒక్కజాతి రెండుముక్కలు కావడం, ఒక్కగుండె రెండుచెక్కలు కావడం బాపురెడ్డి సహించలేరు. సమైక్యత అంటే ఆయనకు ప్రాణం. అందుకే

"గోదావరి కృష్ణ నేడు
కూడిపాడగా
ప్రతి ఆంధ్రుని ఎద సమైక్య
భావ మాడెగా!' అంటూ సమైక్యతా గీతాన్ని మధురంగా

ఆలపిస్తున్నారు.

"జాత్యైక్యత విశ్వప్రేమ
గీతి పాడరా!
నవ్య జీవితాభ్యుదయో
త్సవము నేయరా!'అంటూ ప్రగతి ప్రస్థానానికి తెలుగువారి

వెన్ను తడుతున్నారు.

కాంతిరేఖలు, శాంతివాకలు అయిన తీరవాసులను కవితలో వర్ణిస్తున్నారు కవి.

"కడలి అలల కలలపుట్టి పెరిగినాము
లలిత
కళల సౌరభాలు మోసి తెచ్చినాము
తీరవాసులం దూర
తీరవాసులం మేము"-అంటూ

ప్రశాంతమైన వాతావరణంలో బ్రతుకును స్వచ్ఛంగా గడిపే తీరవాసులు ఎంతైనా అదృష్టవంతులు. కావ్యభాష వారికి తెలియకున్నా నేల బాస, గాలి బాస వారికి తెలుసు. ఆ బాసలోనే వారు తేనె పాటలు పాడుతారు. అన్ని తరహాల మనుష్యుల మనస్తత్వాలు బాపురెడ్డికి అనుభవైకవేద్యమే! తీరవాసులనుండి పాలమూరు పనివాళ్ళ వరకూ అందరూ ఆయనకు స్నేహితులే, సన్నిహితులే! పరస్పర వ్యతిరేకతలను సమన్వయపరిచే స్నేహశీలి బాపురెడ్డి. అందరినీ అన్నిటినీ తనలో పొదుగుకొని నిజంగా సాగిపోయే ఆనంద గోదావరి బాపురెడ్డి కవిత.

ఇక ఆయన "భావాలు" అను కవిత కవిస్థితిని చిత్రంగా చిత్రించింది.

"ఎదలోన భావాలు
కదలాడుతాయి
కాగితము రమ్మంటే
కనులు మూస్తాయి" ఎంత నిజం!

" నేనిదుర పోగానే
నిదుర లేస్తాయి
లేచి లేవకముందే
లేచి పోతాయి
..........

వాటి ఇష్టమ్మైనా
మాటలే వినవు
వాటి మాటలు విని
వ్రాతు కవితలను

కాగితం కలం పట్టుకొని గంటలు నిరీక్షించినా కటాక్షించని భావాలు, ప్రమత్తతగా ఉన్నప్పుడు ఆకస్మికంగా ఊడిపడతాయి. ఏం లాభం? అప్రమత్తతతో సన్నద్ధమయ్యేసరికి ఎండమావులవలె ఊరిస్తాయి వాటి రాజ్యమే తప్ప కవికి అధికారం లేశమైనా లేదు. ఇకవాటి మాటలు విని కవితలు వ్రాయడమే శరణ్యం!

'చుక్కల్లో ఉషశ్రీ' అను కవిత బాపురెడ్డి కన్నీటి చుక్క! 1969లో కవిగారి చిన్నారి ఉషశ్రీ కన్నుమూసినప్పుడు ఆయన కన్నుల నుండి ఇది జారింది.

'ఉషారాగమును
నిశా నాగములు
ఓర్వలేక మ్రింగినవి
రవి హృదయమ్మున
కవి హృదయమ్మున
కారుమబ్బు కమ్మినది'

ఉషశ్రీ భవబంధాలు త్రెంచుకొని బాలయోగినివలె దివికి చేరుకొంది.

'ఎక్కడో వెలుగు
చుక్కపాపల, మీ
రొక్క తార చేరినది'

'బాపురెడ్డి గేయాల'లో ఆఖరిగేయం 'కాలం'.

'చుక్క లనే కళ్ళతో
చూస్తున్నది కాలం
శూన్య మనే కడలిని
శోధిస్తున్నది కాలం'

4)

క్షణంకూడా ఆగకుండా ఏ గమ్యం లేకుండా సాగిపోవడమే కాలం లక్ష్యం. ఎన్నో మార్పులను ప్రవేశపెడుతూ, నదిలా అది ప్రవహించి పోతుంది. ఎన్నో నాగరికతలు, సామ్రాజ్యాలు, వైభవాలు దానిగర్భంలో నిధిలా దాగున్నాయి.

'గతము, భావి, ఆది, తుది
స్థితిలయములు లేవు
అనంత మను భావనకే
అర్థమ్మే లేదు'

... ... ...

దేశకాలములు తమకే
తెలియక తడబడుతుంటే
ఎంతో తెలిసినయట్లు
గంతులు వేయును నరుడు'

చివరగా మానవునకు ఒక చురక తగిలించి ముగించారు బాపురెడ్డి. 'గంతులు వేయును నరుడు' అనడంలో కోతినుండి మానవుడు పుట్టడం వల్ల వచ్చిన సాంప్రదాయకమైన అలవాటు ఇందు వ్యంగ్యంగా చెప్పబడింది. మనిషి ఎంత విజ్ఞాన నిధియైనా ప్రకృతిదృష్టిలోనూ, కాలందృష్టిలోనూ, చిన్నవాడే! తన అల్పత్వాన్ని నిర్భయంగా ఒప్పుకోవడం మానవుడి దొడ్డతనానికి నిదర్శనం కాగలదు.

కాగా – భావకవిగా, అరుణభావకవిగా ఈ గేయాలలో మనకు పరిచయమయ్యారు బాపురెడ్డి. ఆయన కవితా స్వరూపం కుదరమైతే, ఈ వ్యాసం ఒక అద్దం మాత్రమే! సౌందర్య భావనను అక్షరబద్ధం చేసినా, సాంఘిక సమస్యను కవితగా మలచినా లలితత్వం వదులుకోని కవి బాపురెడ్డి. ఆ లలిత కవితా సౌరభాలకు వేదిక ఈ 'బాపురెడ్డి గేయాలు.'

# బాపురెడ్డి పద్యకావ్యాలు

అద్భుతమైన భావన కలగడం, ఆ భావనకు తగ్గ స్వచ్ఛమైన పదబంధాలు అప్రయత్నంగా ఉరికివచ్చి అత్తరుసీసాల్లా పరిమళించడం ఒకవరం! కవితా సాధన ఒక తపస్సాధన వంటిది. ఎందరో సాధన చేసినా కొందరికే ఫలితం. కవి వ్రాసిన ప్రతిరాతా కవిత కానట్లే,కవిత్వం వ్రాసే ప్రతివాడూ కవి కాడు. దర్శనం, ఆర్ద్రత,ఆవేదన ఇత్యాది గుణాలు కవికి పుష్కలంగా ఉండాలి. ఒక వస్తువును దర్శించి, ఆర్ద్రతతో తడిసి, ఆవేదనతో విరచించిన కవిత్వం శతాబ్దాల మన్నికతో విరాజిల్లుతుంది.

ఆధునిక కవితారంగం ఇంద్రధనస్సు వంటిది. ఎన్నో జీవకాంతులతో మనుగడ సాగించే మనస్సు కలది. అందుకే ఈనాడు ఎన్నోరకాల ధోరణులు, ఆ ధోరణులకు దోహదపడే కవులు మనకు సాక్షాత్కరిస్తున్నారు. మార్పు హర్షణీయమే సందేహం లేదు కాని, ఆ మార్పువలన రసజ్ఞులలో క్రొత్తభావన సరిక్రొత్త చేతన ఆవిష్కృతం కావాలి. పరిష్కృతం కాని అనేక సమస్యలకు ఆ మార్పు జవాబుదారి కావాలి! క్రొత్తరంగు రుచి వాసన ఆమార్పులో అగుపించాలి. అప్పుడే ఆమార్పుకు రాణింపు.

నాటి నన్నయ, తిక్కన, శ్రీనాధుడు, పాల్కురికి, పింగళి చేమకూర తమ పరిధిలో నవత్వాన్ని సృష్టించి, సాహిత్యరంగ నీరాజనాలు అందుకున్నారు.

నిన్న గురజాడ నేడు శ్రీశ్రీ ఆధునికత్వాన్ని కవితారంగంలో ప్రవేశ పెట్టి-జాతిని చైతన్యంతో నడిపిస్తూ ఉపద లందుకుంటున్నారు.ఒక సరిక్రొత్త పంథాలో తాను పయనిస్తూ, తనవెంట పదిమందిని త్రిప్పుకొనే నేర్పు కవికున్ననాడు ఆకవి-ఆతడి కవితాజాతికి 'తీపిగుర్తు'గా మిగిలి పోతాడు.

శిల్పానికి అవసరమైన శిల శిల్పికి తెలిసినట్లు, కవితకు కావలసిన వస్తువు కవికి తెలుస్తుంది. వస్తువును కలంలో వేసి గిలకరించి అక్షరాల పోతతో కాగితాన్ని అలంకరించేవాడు కవి.

'నా ప్రత్యేకత నిత్యనూతనత, వీ
ణావేణు సంగీతరా
గ ప్రత్యూషము నానివాసము, నిస
ర్గ స్వాదు సౌందర్య భా
వ ప్రక్షేపము నా విలాసము, జగ
త్స్వప్న ప్రబుద్ధాంతరి
క్ష ప్రస్థానము నా మహాశయము, న
క్షత్రాలు నా కావ్యముల్'అంటూ 'కవితాప్రస్థానం'

సాగిస్తున్నారు బాపురెడ్డి. ఇంతవరకూ వచనకవిత, గేయ ప్రక్రియలయందే లగ్నమైన కవిదృష్టి - పద్యాలవైపు మళ్ళడం వారి ప్రయోగ శీలతను వ్యక్తం చేస్తోంది. 'ప్రయోగం' కవికి ప్రాణం. అది లేకున్ననాడు కవిత నిస్సారమై పోతుంది. ఆధునికమైన చిత్రాలు ఎన్నిచూసినా - హంపి, అమరావతిని దర్శించ ఉత్సుకపడే మానవ హృదయం గత వైభవానికి 'జోహారు' చేసే తత్వంగలదని మనకు తెలిసినదే !

శ్రీ బాపురెడ్డి అక్షరాలతో చెక్కిన ఈ అపురూప పద్య శిల్పాలలో నిబిడీకృతంగా ఉన్న కొన్ని జీవధర్మాలను స్పృశించడం ఈ వ్యాసోద్దేశం. ఆ జీవధర్మాలు ఇవి.

1 అభ్యుదయం
2 నూతనత్వం
3 రమణీయత
4 ప్రణయతత్వం
5 నాయకభక్తి
6 వైరాగ్యతత్వం
7 వాస్తవికత

1 అభ్యుదయం : నన్నయనుండి కవితానది ప్రవహిస్తూ ఎన్నో మార్పులతో మలుపులు తిరుగుతూ, ఈ శతాబ్దంలోకి వచ్చేసరికి అభ్యుదయావతారాన్నిదాల్చి తన ప్రభావంలోకి ప్రతి కవినీ లాగుతూ పుష్టిగా నవ్వుతోంది. ఈ శతాబ్దంలో కళ్ళుతెరిచిన ప్రతి కవి దీని ప్రభావంనుండి తప్పించుకోలేకపోయాడు. అస్తగిరి పర్వతంపైని 'అసూర్యం పశ్య' లా కవిత అంతఃపురాలలో బంధింపబడి విలపించడం ఈ తరాన్ని బాధించిన విషయం. అందుకే చక్రబంధాలు, నాగబంధాలు, త్రెంచుకొని ఈనాటి కవిత సెలయేరులా నవ్వుతోంది. కవి సమాజంలో ఒకడు గనుక సమాజాన్ని దర్శించి, అది అందించిన సందేశాన్ని కవితలో పదిలపరచడం నేర్చుకొన్నాడు. మట్టికి అతీతుడైన మనిషిని, అతని సమస్యలను సానుభూతితో అర్థంచేసుకొని పరిపూర్ణ జీవన విధానానికి పునాది వేయడమే అభ్యుదయం.

"మన్నును దున్ను కర్షకు
మారులు, ఆగని-మిల్లు-ఫ్యాక్టరీ
మున్నగువానిలోన శ్రమ
మున్ వడపించెడివారు, క్లార్కులో
అన్నయలందరున్ ప్రజల
టంచు ఎరుంగుదు; వారి బాధ లే
మున్నవొ, వారి భావి ఎటు
లున్నదొకూడ ఎరుంగుదున్ సఖా!'

(అద్వైతము)

అనడంలో బాపురెడ్డి అభ్యుదయం నెలపివారా నవ్వుతోంది. విలాసినులపై గేయాలు వ్రాసినా కూలిపిల్లను మరువను. ప్రకృతి సౌందర్యాన్ని గానం చేసినా మానవుల కష్టసుఖాలను నిర్లక్ష్యం చెయ్యను. అని కవి అనడం లోని ఆంతర్యం అభ్యుదయం అందించిన ఆవేశం!

"ఎదకరంగ పొంగారగ కదలియాడ
కైతలల్లి పాడితి నంతెకాని, స్వార్థ
పరుడ గాలేదు, నాతోడి ప్రజల వాణి
వినక కూర్చుండి నట్టి పాపియును గాను" అని ఈ శతా

బ్దపు కవిగా ఆయన అన్న మాటలు విశ్వమానవతను, అభ్యుదయ శీల తను వ్యక్తం చేస్తున్నాయి.

2. నూతనత్వం ; మానవత్వం నూతనత్వం నేటి కవితకు ఆభరణాలు. ఈ ఆభరణాలను దాల్చని కవితను ఈనాడు మనం ఊహించ లేము. అక్షరాలు పరిచిన మార్గంలో భావమనే వాహనం ఎన్నో మెలి కలు తిరిగి అందంగా పయనిస్తేనే గొప్ప! కాగా, సుశిక్షితుడైన కవి చేతుల్లో ఉంది ఆ గొప్పదనం. విమానాన్ని పల్టీలు కొట్టించినట్లుగా- భావంతో తమాషాగా సొగసుగా నేటికి అనువుగా కవితను నడిపించడం అవసరం.

పాత సీసాలో క్రొత్తపానీయం, క్రొత్త సీసాలో పాత పానీయం- ఈ రెండూ ఈనాటి తరానికి వ్యతిరేకం! చెప్పేది సూటిగా, సుందరంగా, నూతనంగా ఉండటాన్ని ఈ తరం హర్షిస్తుంది.

'ఈరసాల వృక్షాల కోయిల గళాలు
పోసిన సుగాన సుధ త్రాగివేసెనేమొ?
మండుటెండల గ్రీష్మండు బెండువోవ
మధువుతో పొంగులెత్తె నామ్రఫలజాతి' ఇక్కడ నూత

నత్వం చిందులు వేస్తోంది. 'కోయిలలు కూస్తున్నాయి, మామిడి చెట్లు మధురమైనఫలాలతో పొంగుతున్నాయి' అనడం నవత్వం కాదు. కేవలం

ఋతువును సూచించు చప్పిడిమాట మాత్రమే! కాని, రసాలవృక్షాలు కోయిలగళాలు పోసిన గానసుధను త్రాగి, గ్రీష్మంఁడు బెండువోవ మధువుతో పొంగులెత్తా యనడం నవత్వానికి పతాక!

'గున్నమామిడి, ప్రియకోకిలము
వీడిపోయి ఆనాడు, తపించి, తిరిగి
నవ్యముగ నేడు కూడి గాన్మమ్ము సేయు
నాంధ్ర తెలగాణ మేకమైనట్టి తమిని' అని అనడంలో కూడా నవత్వానికే ప్రాధాన్యత ఇవ్వడం జరిగింది.

3. రమణీయత: ప్రాచీనకవులు రమణీయతకు ఎంతో ప్రాధాన్యాన్ని ఇచ్చారు. కొందరుకవులు కేవలం రమణీయత ధర్మమా అని నేటివరకూ మిగిలారేమో! నగ్నంగా నిలబడ్డవనితను, అందాన్ని కోల్పోయిన కవితను మనం చూడలేము. కవిచూచినదృశ్యాన్ని కేవలం దృశ్యంగా, వాచ్యంగా కాక నగిషీపనులతో అందంగా చెక్కడాన్ని మనం రమణీయతగా పేర్కొనవచ్చు. కవితను పఠించగానే 'ఆహా' అనిపించేతత్వం రమణీయత వద్ద ఉంది.

'ఉగాది ప్రతిఏటా వస్తుంది. మనం ఆనందంగా జరుపుకుంటాం. మనచుట్టూ ఉన్న ప్రకృతికూడా మన ఆనందానికి దోహదం చేస్తుంది'. ఇది స్థూలదృష్టితో మనం ఉగాది కిచ్చే ప్రాధాన్యం. కాన కవిదృష్టి అట్లా కాదు.

'బాలలబాలికలు పుష్పాలవోలె ప్రభాత
వేళ ఆస్యాల హాసాలు నింప
ప్రతిగృహ మ్మొక పల్లవితమహీరుహ మట్లు
పచ్చతోరణముల పరిఢవిల్ల
యువతీ యువకులు కల విహంగము కిల
కిలలట్లు పరిహాసములను విసర
ప్రతివాడు మలయమారుత వీచులట్టు లు
జ్జ్వలభావితావి శ్వాసలు వెలార్చ

ఎటు గనిన రాగ మంగళార్భటి చెలంగ
పటుతరోత్సాహ దివ్యప్రభలు వెలుంగ
నేడె ఊరూర వనలక్ష్మి నిల్చి యుంపు
గా ఉగాది జరుపుకొనుకరణి తోచు!' అని అనడం

బాపురెడ్డి కవితారమణీయతకు నిదర్శనం.

4. ప్రణయ తత్వం: ప్రేమ మనస్సంబంధమైనట్టిది. దానికి హద్దులు లేవు. నిర్వచనం లేదు. ఆర్ద్రతతో తడిసిన హృదయం, ఆప్యాయతకు చోటివ్వగలమనస్సు దానిపెట్టుబడి, అప్పుడే

'అర్చనము లేని నాయౌవనాలయాన
చంచలాదేహా! నిను ప్రతిష్ఠించుకొరకు
ప్రణయగీత మంత్రాలెన్ని పాడినానొ,
ఎన్ని గరళాబ్ధు లీదితి నెరుకగలదె!' అని అనగలం.

ప్రేమను స్మరించగానే బాపురెడ్డి స్మృతినాళం ఎట్లా మ్రోగుతోందో చిత్తగించండి.

'పాడితి వీవు నాప్రణయ
పల్లవబాహురసాల శాఖలన్
పీడక నిన్ను పట్టుకొన,
వేల అకాల వసంతమాధురుల్
పాడెను; శీతవాతములు
భగ్గున మండెను; ఆదినమ్ము నే
నాడు స్మరించుకొన్న స్మృతి
నాళము మ్రోగును శబ్దపేటియై!'

ఆమెపాడి ఆతడిచే పాడించింది. ఆమె ఆడి ఆతడిచే ఆడించింది. భావాలు అతనివి. భాష ఆమెది. ప్రేరణము ప్రియునిది. నాట్యాలరీతి ప్రేయసిది. వారి ప్రేమ స్వచ్ఛమైనది. అందుకే

"వచ్చిపోవవచ్చు ప్రభువులు ప్రభుతలు
కాని-నిల్చిపోవుగా చరిత్ర
చచ్చిపోవవచ్చు సశరీర ప్రేమికుల్
చచ్చిపోదు ప్రేమ శాశ్వతమ్ము"

5. నాయకభక్తి: ఈదేశక్షేమంకై-ఈదేశపుదాస్య శృంఖలాలు ఛేదించుటకై నడుముకట్టి సర్వస్వం త్యాగం చేసిన నాయకులను భక్తితో స్మరించడం మనకనీస ధర్మం. నాయకభక్తి కలిగియుండడం కృతజ్ఞత. లేకున్న కృతఘ్నత. బాపురెడ్డి మనస్సులోదాగి ఉన్న ఆ కృతజ్ఞతాభావాన్ని అక్షరబద్ధంచేసిన స్మృతికవితలను మనమిప్పుడు దర్శిద్దాం.

"శాంతిదూత" నెహ్రూ స్వతంత్రభారతరథసారథి. ఆయన మరణానికి పరితపిస్తూ కవిహృదయంనుండి పొంగినతరంగం- ఆయనపట్ల కవి కున్న భక్తిని వ్యక్తం చేస్తోంది.

"రాలిపోయెను విశ్వంభరా కిరీట
రమ్యనవ జీవనచ్ఛటా రత్నమొకటి
తడిసిపోయెను మనవతా కవోష్ణ
బాష్పములతోన నేడు నాభరతభూమి"

శాంతికి చిహ్నంగా, భరతజాతికి జీవనదాతగా, జగత్క్రాంతికి హేతువుగా, నవశకాన్ని నిల్పిన దివ్యభావనాస్వాంతుడు, ధర్మపాలకుడు జహ్వరులాలు. ఆయన మరణం జాతికి గ్రహణం. దేశమంతా ఆయన సందేశంపాటించి, స్వేచ్ఛా శాంతి ప్రగతి ప్రదీపన సుదీక్షాబద్ధమై పురోగమించిననాడు ఆయన ఆత్మకు నిజమైన శాంతి.

ఇక విలక్షణమైన ఆశయాలతో దేశస్వాతంత్ర్యాన్ని ఆకాంక్షించి-బెబ్బులివలె తెల్లదొరలపై విజృంభించిన నాయకమణి సుబాస్‌చంద్రబోసు. కొందరు ఆయన జీవించి ఉన్నాడంటారు. మరికొందరు 'లే' డంటార్లు. వాస్తవానికి సుబాసు ఈదేశం ప్రతి అణువులోను ప్రతిఫలిస్తున్నాడు.

"చచ్చితి నందునా స్వాతంత్ర్య వీరజీ
వనభావనలోన బ్రతికియుంటి
బ్రతికితి నందునా పారతంత్ర్యము పీల్చు
పచ్చనెత్తుట పడి చచ్చియుంటి
చచ్చితి నందునా స్వారాజ్యలక్ష్మి భా
రత సౌధకుడ్యాల బ్రతికియుంటి
బ్రతికితి నందునా స్వార్థసంకుచిత దం
ష్ట్రల చిక్కి ముక్కలై చచ్చియుంటి

చచ్చితినె, లేదు బ్రతికిన జాడగలదు
బ్రతికితినె, లేదు చచ్చిన వార్త గలదు
బ్రతికి చచ్చిన వీర సుభాసు నేను
చచ్చి బ్రతికిన జీవనాశయము నేను"

6. వైరాగ్యతత్వం: ఫ్రీలాసొసైటీ నుండిచలంప్రస్థానంసాగిస్తూ, రమణాశ్రమానికి చేరుకొని ఊరటపొందాడు, హేతువాదంతో పురోగమిస్తూ గోపీచంద్ అరవిందాశ్రమంలో విశ్రాంతి పొందాడు. పేరుమోసిన ప్రతి మహావ్యక్తి క్రొత్తయుగపు తీవ్రావేశాలతో మండిపోయి, చివరికి వైరాగ్య తత్వంలోపడి సేదతీర్చుకోవడం గమనార్హం! ఆస్తికుడైనా, నాస్తికుడైనా చివరిదశలో వైరాగ్యపు అంచుకు చేరి నింగికొసలుముట్టడం జీవధర్మం.

అర్థమువెంట ఒకప్పుడు, పదార్థజ్ఞానమునకై మరొకప్పుడు, స్వార్థములవెంట, పరమార్థమ్ములవెంట పడి నిరర్థకమైన కవిహృదయపు నివేదన ఇది.

"నాకనుల భ్రాంతికొల్పెడి
చీకటితెరలేవొ కలవు చిక్కవు నాకున్
లేకుండిన అడుగడుగున
నా కెందుకు నిన్ని మాయనాగులు తగులున్"

ఆదితుదిలేని సృష్టికి కాదని ఔనని నీవె కారణము.ఎంత వాదించి వివాదపడినా లేదు సమాధానము. అని పరమాత్మను సంబోధిస్తూ

నాక్షుభితమైన మేధకు
ఏక్షణమున శాంతిలేదు ఈ చీకటిలో
చక్షువు నా కీవే, పరి
రక్షణ మీవేను చూపరావెల్గు! ప్రభూ! అంటూ శాంతికోసం

వెలుగుకోసం తాను పడే ఆతురతను వ్యక్త పరిచారు.

7. వాస్తవికత: కల్పనతో ఎన్ని పేజీలనైనా నింపవచ్చు. ఎన్ని కావ్యాలనైనా వ్రాయవచ్చు. ఒకానొక సందర్భంలో పాఠకులతోను, సమాజంతోను నిమిత్తం లేకుండా కవితను ఆత్మ లోతుల్లోనికి పోనిచ్చి అయోమయాన్ని సృష్టించవచ్చు.

పాశ్చాత్య నాగరికతా సమ్మేళనంవల్ల మనకు దక్కినవరం వాస్తవికత! ఉన్నది ఉన్నట్లుగా చెప్పడం వాస్తవికత అయినా కవితపట్ల అది వర్తించదు. కవితదృష్టిలో అది వార్త మాత్రమే! అగుపించే దృశ్యాల వెనుక మెరుస్తూనిలిచే సత్యాన్ని కవితలో ఆవిష్కరించడం వాస్తవికతగా మనం నిర్వచించవచ్చు.

ఈ బాపురెడ్డి పద్యకావ్యాలలో వాస్తవికతకు దర్పణంపట్టిన కావ్యం 'ముక్తివాహిని'. 1971 బంగ్లాదేశ విముక్తి పోరాటకాలంలో పొందిన భావసాగరమిది. అక్కడిప్రజల చైతన్యశక్తిని కళ్ళకుకట్టి చూపిస్తున్నారు

"పదును కత్తులవోలె పడుచువా ళ్ళెగసిరి
బాకులై రదె పసిపాపలంత
కన్నెపిల్లలు మిషన్ గన్నులై నిల్చిరి
ముదుసళ్ళు ముల్లెలమోత లైరి
వీర విద్యార్థులు భూరి బాంబులు కాగ
ఉద్యోగులే వృత్తివిద్య లైరి

రాళ్ళ రప్పలునహో రైఫిళ్ళ తూటాలు
అడవులు గిరులు రణాంగణములు

ముక్తివాహినియై జనశక్తిమించె
పారతంత్ర్యోగ్ర వలసాధిపత్య దాన
వత్వమును కూల్చెనదె ప్రజాస్వామ్యలక్ష్మి
కలదె స్వాతంత్ర్యమునకన్న ఘన ధనమ్ము?"

ఆ చైతన్యశక్తికి నిలువలేక - పశుబలంతో, కండకావరంతో మానవులరక్తం త్రాగ మరిగిన బంగ్లాదేశ విద్రోహులంతా గుండెపగిలి చచ్చారు. బంగ్లాదేశ్ ఎల్లెడలా దిగ్విజయోత్సవ ప్రభలు ఉజ్వలంగా వెలిగాయి.

ఈ విధంగా అభ్యుదయాన్ని, నూతనత్వాన్ని, రమణీయతను, ప్రణయతత్వాన్ని, నాయకభక్తిని, వైరాగ్యతత్వాన్ని, వాస్తవికతను, ఆయా సందర్భాలకు అనుగుణంగాకూర్చి పద్యకావ్యాలుగా మలిచి సాహిత్య లోకంలోకి వదిలారు బాపురెడ్డి. విడివిడిగా యివి చిన్న దీపాలైనా-అవి ఉత్పత్తిచేసిన కాంతి సంపదమాత్రం దొడ్డది!

# బాపురెడ్డి గేయనాటికలు

అలనాడు రెడ్డిరాజుల పరిపాలనలో తెలుగు కవిత్వం మూడు పూవులు ఆరు కాయలుగా విలసిల్లింది. శ్రీనాధుని వంటి మహాకవి ఆ రోజుల్లోనే గళాన్ని సవరించి, కలాన్ని కదలించి విరవిహారం చేశాడు. పూటలు పాటలుగా పాటలు విరితోటగా సెలయేటి ఊటలవలె బంగారు బాటల వెంబడి పయనించిన కాలమది. కాలం కదిలి ఎంతో ముందుకు వచ్చేసింది. ఆ కాలం 'గత' కాలమైపోయింది. ఆనాటి రెడ్డిరాజులు ఈనాడు రెడ్డికవులుగామారి కవిత్వాన్ని ఎంతో ముందుకు తీసుకు పోతున్నారు. బెజవాడ గోపాలరెడ్డి, సి. నారాయణరెడ్డి, ముకురాలరామా రెడ్డి, కె. శివారెడ్డి, ఎల్లంద రఘుమా.రెడ్డి పట్టాభి రామిరెడ్డి (పఠాభి), పులికంటి కృష్ణారెడ్డి ఇలా లెక్కిస్తున్నకొలదీ ఎందరో రెడ్డికవులు భాష లోను, భావంలోను నవ్యతను సాధించినవారు మనకు దర్శనమిస్తారు. ఆ రెడ్డికవుల కోవకు చెందినవారే మన బాపురెడ్డి.

ఆంధ్ర సాహిత్యరంగంలో ప్రకాశించే ఉజ్వల తార శ్రీ జె. బాపురెడ్డి. మధురమైన భావాలకు మృదువైన పదాలతో కవిత్వంగా వండి సాహితీ యాత్రికులకు విందుచెయ్యడం ఆయన దినచర్య! ఆ విందులోని ఒకానొక మధురమైన పదార్థమే ఈ "గేయనాటికలు".

'బాపురెడ్డి గేయనాటికలు' అనే ఈ సంపుటిలో ఎనిమిది గేయ నాటికలున్నాయి. ఋతురాగం మొదలుకొని యన్. జీ. వో. వరకు ప్రతి గేయనాటిక కవి హృదయాన్ని ప్రస్ఫుటం చెయ్యడంలో కృతకృత్యత సాధించింది.

ఋతురాగం : ఆరు ఋతువులను స్త్రీలుగా భావించి, స్త్రీలలో సహజంగా చెలరేగే ఈర్ష్య అసూయలను ఆలంబనగా తీసుకొని రచింపబడ్డ నాటిక ఇది. ముందుగా వర్షాసుందరి ప్రవేశించి.

'కడలి లోని నీరు మబ్బు
కడవతో మోసి తెచ్చి
మండిపోవు పుడమితల్లి
గుండె సేదదీర్చినాను
వర్షాసుందరి నేను
ఇల
కర్షక లోకానందము నేను' అంటుంది.

లోకానికి పచ్చదనాన్ని, రైతులోకానికి హర్షమనే వెచ్చదనాన్ని ప్రసాదించే రాణినని వర్షాసుందరియొక్క గర్వం.

'నేను లేనిచో లోకమంతయును
ప్రాణములేని ఎడారిసుమా !
నేను రానిచో మానవజాతికి
నిత్యనరక యాతనలె గదా !' ఇదీ ఆమె గొప్ప !

అంతలో శరద్బాల రంగంమీదికి వచ్చి, వర్షాసుందరి గొప్పలను అవహేళన చేస్తుంది.

'చాలు చాలు నీ గొప్పలు
చాలించవె వర్షాంగన
నింగినుండి దిగివచ్చిన
నీరదాల రాణివటే ! అంటూ వర్షాసుందరి కోపంతో నిష్క్రమిస్తుంది. శరద్బాల హాసంతో పురివిప్పుతుంది.

'అందాలకు రాణిని
అమృత విజయవాటిని
దివినుండి దిగివచ్చిన
నవశారద లక్ష్మిని' అంటూ

వింత వింత చిరుగాలులతో వీవనలు వీచడం, లోకమెల్ల కళానంద లోకములో తేవ్చడం అన్నది శరద్బాల ప్రతిభ.

'నారాకే లోకానికి
నవభావన నాకము
నాపాటే జనావళికి
దీపావళి పర్వము' ఇదీ అమె తృప్తి ! అప్పుడు వెనుక నుంచి హేమంతకాంత ప్రవేశించి, శరద్బాలపై విరుచుక పడుతుంది.

"వెన్నెల కోకలు కట్టగనే
వన్నెలాడివి కాలేదు
మబ్బుల దండలు పట్టగనే
మహియే స్వర్గము కాలేదు' అని. తెల్లబోయిన శరద్బాల చల్లగా జారుకుంటుంది. హేమంతకాంత ఠీవిగా ముందుకు వస్తుంది.

మంచుపైట, నవ
రించి ఆడు, సీ
మంతిని నే, హే
మంతిని నేను !' అంటుంది.

పొలాలన్ని పంటలు పండించిన కాంతినినే సంక్రాంతి నేను అన్నది హేమంతకాంత అతిశయం

'గుమ్మడిపూవుల
గుండెలు విరిసెను
సెనగ పూవులు చెలి
సిగ్గులు వీడెను' ఇదీ ఆమె ప్రగతి ! అప్పుడు శిశిర భామిని ప్రవేశించి హేమంత కాంతను ఎదురిస్తుంది.

'ఎంతకర్కశ హృదయ
వే నీవు హేమంతి ?
ఇలను శీతలపు సం
కెళుల బంధించితివి!' అంటూ హేమంత కాంతచకితురాలై తప్పుకుంటుంది. శిశిరభామిని ఆడంబరాన్ని ప్రకటిస్తుంది.

'శిశిర బాలను
శివ సుఖేలను
ప్రేమభావము
పెంచుదానను' అంటూ

త్యాగశీలము, దయాధర్మము. సహృదయత్వము, శాంతిసహనము, ఇవి శిశిర భామిని తనకుతాను తగిలించుకున్న బిరుదులు.

"నా బ్రతుకు వెచ్చించి
నలిగిపోయెడి ప్రకృతి
లో చేతనమునించగలను
ఈ ధరణిలో కళల పోషించగలను" అన్నది శిశిర భామిని ప్రతిజ్ఞ! అప్పుడు వసంత కుమారి ప్రవేశించి నిరసన ప్రకటిస్తుంది.

'ఎందుకు ? ఎందుకు ? ఎందుకు ?
ఈ విలయ నాట్యమెందుకు?
అందము చూచి స
హించని దానా !' అంటూ. అప్పుడు శిశిర భామిని తప్పుకుంటుంది. వసంత కుమారి వైభవాన్ని ప్రకటించుకొంటుంది.

'కోకిల పాటలు
పూవులతోటలు
నేను నడచిన బాటలలో
నేను నిలిచిన చోటులలో'

"కవితకు కళలకు కారణమైతిని ఉగాదినైతిని యుగాదినైతిని" అన్నది వసంతకుమారి వైభవ దర్పణం.

"నింగికి
నేలకు
నిర్మల చాంద్రీ
డోలలు కట్టిన బాలను నే" అన్నది వసంతకుమారి స్వరూపం. అప్పుడు గ్రీష్మరాగిణి ప్రవేశించి వసంతాన్ని ధిక్కరిస్తుంది.

'వాసంతమా! ఈ వి
లాసమేలా? వి
లాసమ్ములో ఇంత
మోనమేలా?' అని, వసంతకుమారి హడావిడిగా వెళ్ళి
పోతుంది. గ్రీష్మరాగిణి విజృంభిస్తుంది.

"వచ్చాను వచ్చాను
గ్రీష్మరాగిణి నేను
శిరముపై చండరవి
భాండమ్మును వహించి
శివుని ఫాలాగ్నికీ
లా మాలలు ధరించి" అంటూ మట్టిలో భాగ్యాల మణులు
మేల్కొలపాలి. అప్పుడే నాదు క్షుభితాత్మ శాంతిల్లాలి అన్నది గ్రీష్మ
రాగిణి ఆకాంక్ష!

అప్పుడు కాలపురుషుడు ఆందోళితుడై రంగప్రవేశంచేసి ఋతు
కన్యలను పిలుస్తాడు. వరుసగా ఋతువులు వచ్చి కాలపురుషునివద్ద
నిలుస్తాయి.

"మీలో మీ రిట్లు హద్దు
మీరి పోరుపడకండి!
ఈకాలపురుషుని బ్రతుకు
లో తుఫాను రేపకండి' అని కాలపురుషుడు ఋతుకన్నె
లను సున్నితంగా మందలిస్తాడు.

ఋతువులన్నీ కాలపురుషుని చుట్టూచేరి నృత్యంతో బృందగానం
ఆలపిస్తాయి.

"ఋతురాణులమూ

ప్రకృతి వీణలము' అంటూ ప్రకృతిలోని ప్రతివస్తువు
కవిని ఏదో విధంగా, యథోచితంగా పలుకరిస్తూనే ఉంటుంది. ప్రకృతి

ప్రభావంనుండి సాధారణంగా తప్పించుకోలేదు. 'వాల్మీకి' మొదలుకొని "జాలాది" వరకూ అందరూ దానిముందు శిరస్సు వంచినవారే !

ఇక ఋతువులుకూడా కవుల కవితల్లో ఋక్కులవలె మెరిశాయి. అనంతమైన ఆ మెరుపుల ప్రవాహంలోని ఒక చిరుకెరటమే ఈ ఋతు రాగం!'

సాగరసౌధం : ఎన్నో శతాబ్దాలుగా కృష్ణవేణి అలాఅలా గల గలా ప్రవహిస్తూనే ఉంది. దోసిలి పట్టినవారికి తియ్యని నీరం, శిరస్సు వంచిన వారికి జన్మకు సరిపోయేపుణ్యం ఆమె అందిస్తూనే ఉంది. అయినా ఆమెకు ఇల్లు కట్టేందుకు ఎవరూ ముందుకు రాలేదు. కన్నీటి కెరటాలతో ఆమె సముద్రునివద్దకు వెళ్ళి పిలవిస్తూనే ఉంది. స్వాతంత్ర్యానంతరం తెలుగుప్రజ ఆమెకు సౌధం కట్టాలని సంకల్పించింది. ఆ సంగతి తెలిసిన కృష్ణవేణి.

'నిజమేనా! నిజమేనా!
నేను కన్న కల నిజమేనా!
బాధా మయమౌ నా చిరగాథ
పండువెన్నెలై విరిసేనా ?
రాలే నిండిన నా ఒడినిండ
రత్నరాసులిక కురిసేనా?" అంటూ సంబ్రమ

పడుతుంది. అప్పుడు ప్రజలకోరికపై నాగార్జునుడు యోగనిద్రనుండి లేచి ముహూర్తం నిర్ణయిస్తాడు.

'ఈ శుభోదయ వేళకన్న
ఈ నవోదయ వేళకన్న
ఏకతా శస్త్రమ్ము మీరు
చేకొనిన ఈ వేళకన్న
లేదు వేరే మూర్త మన్నది' అంటూ ప్రజల వెన్ను తడ

తాడు. చైతన్యం రగుల్కొనగా ప్రజాశక్తి విజృంభిస్తుంది.

'రండీ! రారండి వెలుగు
జెండా ఎగరేయండీ !
కృష్ణమ్మ ఎద నిండే
ఖిల్లా నిర్మించండీ!' అంటూ పాటలతో సౌధాన్ని పూర్తి చేస్తారు. పూర్తికావింపబడిన సౌధాన్నిచూసి కృష్ణవేణి.

"చిత్రచిత్రమైన ప్రకృతి
చిత్రాలే దిశలయందు
మయసభ ఏమాత్రము, ఈ
మహిమా భవనము ముందు?" అని పరవశించిపోతుంది.

"జయజయ సాగర సదనా
జయ విద్యుత్ స్మితవదనా" అన్న బృందగానంతో "సాగరసౌధం" సమాప్తమౌతుంది.

ఈ నాటికను చదువుతుంటే చిన్నతనంలో "రంగులరాట్నం" తిరిగిన సంఘటన గుర్తుకు వస్తుంది. అర్ధణా ఖర్చుతో ముల్లోకాలు దర్శించిన అనుభూతి అది. తక్కువ పేజీల పఠనంతో నాగార్జునసాగర్‌ను చూసిన ఆనందం ఇది.

భావిజీవులు : పుట్టినవాళ్ళందరినీ పోషిస్తాడు పరమాత్ముడు అన్నది నిన్నటిమాట. బ్రతుకుబాట లేనివాణ్ని భగవంతుడైనా పుట్టించకూడదు అన్నది నేటిమాట. పుట్టినవాళ్ళకు ఆధారం దేశకాలాలు.ఆ దేశకాలాలు కనిపెంచేవాళ్ళ పక్షాన తమ బాధ్యతను గుర్తించి భావిజీవులతో సంభాషించడం ఈ నాటికలోని ఇతివృత్తం. 'దేశకాలాలు' రంగంమీదకు వచ్చి

"పుట్టదలచిన
జీవులారా!
పెట్టుకొండి ప్రవేశపత్రము

అనవసరముగ
జనన మొందిన
అవును మీ బ్రతుకేమొ స్వతము!" అంటాయి.

ఛాయామాత్ర వేషాలతో "భావిజీవులు" లేచి

"అలా అనే దెవ రది?
ఆకాశవాణిలా
భావి నిరూపించ నెంచు
ప్రణాళికల రాణిలా,
బయలుదేరనున్న మమ్మ
పట్టీ ఆపుదు రెట్లు
గళము జారకుండ హరుడు
గరళము బిగపట్టినట్లు" అంటూ ఆవేదను వ్యక్తపరుస్తారు.

అప్పుడు దేశకాలాలు నచ్చచెప్పే ధోరణిలో

"చోటున్నా లేకున్నా
చొరబడి మూడవతరగతి
పెట్టెల్లో, యమయాతన
పడ వద్దంటున్నాము
... ... ...
... ... ...
"పుట్టినవాళ్ళను, ముందు
పుట్టబోవు మిమ్మను సుఖ
పెట్టాలని మా యత్నం'
"పుట్టుటకై మీరందరు
పెట్టుకొనే దరఖాస్తులు
చాల పరీక్షించి జనన
కాలము నిర్ణయిస్తాము." అంటాయి.

ఈ నాటిక "కుటుంబనియంత్రణ" ను రమ్యమైన పద్ధతిలో ఆవిష్కరించింది. "ఇద్దరు లేక ముగ్గురు చాలు" అన్న పాడిపాడి మాటలు విని విసుగెత్తిన జనావళికి, కొత్తపద్ధతిలో దానిసారాన్ని సులభంగా అందిస్తోంది. ఈనాటికను నూతన వధూవరులకు పెండ్లికానుకగా ఇచ్చిన నాడు ఆజంట, జంటను మాత్రమే కని చాలుచాలు అంటుంది.

విజయహేల : విజయ పరంపరల స్వరూపిణియై, యుగయుగాల నుండి మానవ కల్యాణానికి మంగళగీతం పాడుతూ-ఏటేటా వచ్చేవిజయ దశమికి స్వాగత గీతికే ఈ నాటిక. ఇందులో విజయదశమి మరో నాలుగు కంఠాలు పాత్రలుగా వస్తాయి.

మొదటి కంఠం :

"మహామాయులగు
మధుకైటభులను
శక్తి రూపమున
జయించి వెలసిన

మాయాదేవీ, రావమ్మా!

మహాకాళి నీవేనమ్మా!' అంటూ మహిషాసుర మర్దనియైన మహాలక్ష్మికి స్వాగతం పలుకుతుంది.

రెండవ కంఠం :

'క్షుద్రాసురులగు
శుంభనిశుంభుల
చండ ముండులను
చెండాడిన, ఓ

చాముండేశ్వరి, రావమ్మా !

సరస్వతివి నీవేనమ్మా !' అంటూ కంసారియైన బాలకృష్ణునకు ప్రాణంపోసిన తారాదేవికి, శారదలక్ష్మికి స్వాగతం పలుకుతుంది.

మూడవ కంఠం :

శాకఫలాదులు
లోకమునకు ఇడి
క్షామపిశాచిని
వదలించిన

శాకంబరి, వేరావమ్మా!
రక్తదంతి, స్వాగతమమ్మా! అంటూ దుష్టరాక్షసుడు

దుర్గుని చంపిన దురిత నివారిణి దుర్గాదేవికి స్వాగతం చెబుతుంది.

ఇక నాల్గవ కంఠం :

ప్రజాహితముకై
భ్రమరాస్త్రమ్ముల
అరుణాసుర సం
హారణము చేసిన

భ్రమరాంబా, స్వాగతమమ్మా !
మాతంగీ, మము కనవమ్మా! అంటూ జయ జయ

భారత జనతాభ్యుదయనిమిత్తమైన విజయదశమికి స్వాగతం పలుకుతుంది.

అందరి ఆహ్వానాలను అందుకుని వస్తుంది విజయ దశమి.

అణ్వాయుధ శక్తికన్న
ఆత్మబలమ్మే మిన్న
బాంబుబలము కాదు, దేశ
భక్తిని పెంచాలన్నా! అని శాంతి సందేశం అందిస్తుంది.

నీతి లేని రావణుడు సీతను చెరబట్టినప్పుడు కోదండరామునకు శక్తిగా నిలచినది, కౌరవులు ద్రౌపదిని అవమానించినప్పుడు శాంతి ధనులు పాండవులకు అండగా ఉన్నది, భరతమాత పారతంత్ర్య బంధనాల చిక్కినప్పుడు గాంధితాతను నడిపించినది, సమరాలు చేసినది-సమరాలు చూసినది. సమరాలలో తగిన సాయమ్ము చేసినది;

'పశుబలముపై ఆత్మశక్తికి
వంచకులపై ప్రజాశక్తికి
ద్వేషములపై ప్రేమ శక్తికి
జానినత్వముపైన స్వేచ్ఛకు' ప్రతీకగా వ్యవహరించినది ఈ విజయదశమి. ఆ విజయ దశమీ త్యాగనిర్మల దేశభక్తికి కవి ఎత్తిన వైజయంతియే ఈ విజయహేల !

కల్యాణయాత్ర (భావఘర్షణ) : మానవుణ్ణి విభిన్న శక్తులు చుట్టుముట్టి కలవరపెడుతున్నాయి. ప్రకృతి, ప్రేయసి, మాతృదేవి, కష్టజీవి, భాగ్యలక్షి, దేశమాత వంటి శక్తులు అతణ్ని తమ తమ స్వాధీనంలోకి లాగుతూ పోటీ పడతాయి. ఈ ఘర్షణలో కర్తవ్యతా మూఢుడైన మానవుడు శర్వశక్తి సమన్వయ కల్యాణ మార్గాన్ని తెలిసికోవడం ఈ గేయరూపకంలోని ఇతివృత్తం. 'మానవుడు' రంగమీదకు ప్రవేశిస్తాడు.

ఎపుడు పుట్టెనో
ఎటుల పుట్టెనో
ఏల పుట్టెనో
ఈ సృష్టి !
జనన మేమిటో
మరణ మేమిటో
మధ్య జీవితపు
మర్మ మేమిటో !
ప్రశ్న కుత్తరము
పది ప్రశ్నలుగా
బ్రతుకు మానవుని
బ్రతు కెందులకో !' అంటూ మథన పడుతుంటాడు.

అప్పుడు ప్రకృతి ప్రవేశించి

'గిరులు ఝరులు, తరులు, విరులు
పరచితిని మనపోవుదారుల
బడుపు బాధలు విరిచి తలుపులు
తెరిచితిని అభ్యుదయసీమకు' అంటూ తన ప్రతాపాన్ని, సేవానిరతిని, మానవునకు వివరిస్తుంది.

ప్రేయసి ప్రవేశించి

''నావెచ్చని కౌగిలిలో
వేవేల సుఖా లున్నవి
నా అధరామృతములో
నవజీవనరుచు లున్నవి' అని ఊరిస్తుంది. మానవుడు ఆమె వెంట పోబోతుండగా 'మాతృదేవి' ప్రవేశించి

'విషమైనా మ్రింగి నిన్ను
పెంచి పెద్దజేసినట్టి
పేదరాలు నీతల్లే
విషమై పోయినదటరా ?' అంటూ నిష్ఠురంగా ప్రశ్నిస్తుంది. మతిపోయిన మానవుడు

''ఇల్లు విడిచి పోతానంటే
తల్లేమో వద్దంటుంది
తల్లిమాట వింటానంటే
ప్రకృతేమో తగదంటుంది
ప్రకృతికి వశమౌతానంటే
ప్రణయిని నను జడుడంటుంది' అంటూ సందిగ్ధావస్థలో పడి ఇంకా తేరుకోకముందే "కష్టజీవి" ప్రవేశించి

"పొలాలలో, గహ
నాలలోన
పరిశ్రమలలో
ఫ్యాక్టరీలలో
పనిచేసే ఈ కష్టజీవులకు
ఫలితమేమిటో ?' అని ప్రశ్నిస్తాడు.

ఈ ప్రశ్న మానవుడి చుట్టూ ఆవరించుకొని ఉన్న సమాజానికి చెందిన దైనా దీనికి జవాబుదారీ మానవుడే ! కాబట్టి ఆతడు సానుభూతితో కష్ట జీవితో కలిసి పోబోతుండగా మళ్ళీ ప్రేయసి అడ్డుతగులుతుంది. మానవుడి మనస్సు అటుగా మళ్ళుతుంది. ఇంతలో భాగ్యదేవత వచ్చి

"అన్ని సుఖాలకు సోపా
నమ్ము నేను
అన్నికోర్కెలకు ఆకారమ్ము నేను'

అంటూ తనశక్తిని విప్పిచెబుతుంది. ఏమిటీ పరీక్షలు? నాకేల ఇన్ని శిక్షలు? అని మానవుడు డిగాలు పడుతూండగా "దేశమాత" హడావుడిగా వచ్చి

దేశమాత దీనముగా
నిన్ను పిల్చుచున్నదిరా !
నవయువకా! అల్పభావ
నలతో పరుగిడకురా! అంటూ ఉద్బోధిస్తుంది.

ఈ విధంగా అన్నిశక్తులు వరుసగా మానవుడిమీదకు దాడిచేసే సరికి దిక్కుతోచదు దారి తెలియదు. ప్రకృతి మనుగడకు తోడ్పడేది. ప్రేయసి మాధుర్యాన్ని పంచియిచ్చేది. మాతృదేవి ఊపిరిని పోసెడిది.

కష్టజీవి దేశానికి భవితవ్యం ఏర్పరచేవాడు. భాగ్యలక్ష్మి లోకాన్నే తనవెంట తిప్పుకొనేది. దేశమాత మాతలకు మాత, సకల సంపత్సమేత. వీరిలో ఎవరిని కాదంటాడు మానవుడు? ఎవరిని కాదన్నా మనస్సు ఎదురు తిరుగు తుంది. ఈ శక్తులన్నీ శరీరాన్ని అంటిపెట్టుకొని ఉన్న అవయవముల వంటివి. ఏదిలేకున్నా మనుగడ అవిటిదై పోతుంది. భావఘర్షణతో, బాధ పడే మానవునకు నేపథ్యవాణి,ప్రకృతి మాధుర్యాన్ని పాటలుగా పాడుతూ, ప్రాణసతితో కూడి తల్లిపాదాలను చేరుకో! ఆతల్లి దీవనలందుకొని చల్లగా జీవిస్తూ, నీ భాగ్యము తోడి ప్రజలతో భాగము పంచుకో! అని కర్తవ్యం బోధిస్తుంది. అప్పుడు మానవుడు అన్ని పాత్రలతో సమన్వయం పొందు తాడు. విజయానందంతో అందరూకలిసి

ప్రేమరథం
భాగ్యపథం
మీద సాగిపోవాలి
పేదరాలి
భాగ్యశాలి
మధ్యతెరలు తొలగాలి! అంటూ అభ్యుదయ గీతి కను ఆలపిస్తారు.

మానవుడిచుట్టూ చక్రవత్ పరివర్తంతే అన్నట్లున్న ఈ శక్తుల గమనాన్ని, వీటి గమనానికి గతితప్పిన మానవుడి ఆలోచనా పథాన్ని, ఈ నాటికలో చక్కగా విప్పిచెప్పారు కవి. నవ్యమైన ఇతివృత్తానికి రమ్యత చేకూర్చింది కవిత్వం!

రాకెట్టు రాయబారం: మానవుడు భూమిని జయించాడు. నీటినికూడా జయించాడు. ఆకాశాన్ని జయిస్తున్నాడు. అనంతరోదసీ యాత్రలో చంద్రమండలం తొలిసోపానం అయింది. మానవుడు పంపిన రాకెట్టు చంద్రమండలాన్ని చేరుకున్నది. అది చంద్రమండలానికి సన్నిహిత సంబంధాలు నెలకొల్పుతుందని ఆశిస్తున్నాడు అతడు.

రాకెట్టు మానవుని రాయబారిగా, చంద్రగోళం చంద్రకాంతగా ఈ నాటికలో చిత్రించడం జరిగింది. చంద్రకాంతకు, రాకెట్టుకు మధ్య జరిగిన ఊహా సంభాషణ ఈ గేయరూపకానికి ఇతివృత్తం.

విజృంభించిన నేపథ్య ఘోషణ మధ్య రాకెట్టు రంగంమీదకు దూకుతుంది. అప్పుడు చంద్రకాంత చైతన్యోద్దీపితయై

"లక్షలాదిమైళ్ళు, అంత
రిక్ష మార్గములోన ఎగసి
ఎంచలేని జవమ్ముతో, ఏ
తెంచినావా ? ఇన్నినాళ్ళకు !

స్వాగతము ! స్వాగతము ! మానవ
జగము పంపిన రాయబారీ !" అంటూ హార్దికంగా స్వాగతం యిస్తుంది. ఆమె ఆహ్వానానికి సంతసించిన రాకెట్టు

"వందనమమ్మా ! కృతజ్ఞతాభి
వందనమమ్మా నీకు,
ఇందుదేవి ! నీ స్వాగతమ్ము ఆ
నందము పిండెను నాకు" అంటూ త్వరలోనే మానవులు నీ సీమకు రానున్నారని చెబుతాడు. చంద్రకాంత చైతన్యము నావెడారి బ్రతుకున చిందేనా అందములు ? అని ఆనందపడుతుంది.

"ఎన్న డిచటకి రా
నున్నాడో చెపుమా ?
ఏమేమి చేయనుం
కించెనో చెపుమా !" అంటూ రాకెట్టును ప్రశ్నిస్తుంది. అప్పుడు రాకెట్టు

సకలగ్రహాలతో
సంబంధములు పెంచ
ప్రాణికోటులకు శా
శ్వత సుఖమ్ములు పంచ

సృష్టి సర్వ మ్మొక్క
సూత్రాన సంధించ
నున్నాడు. నరుడు రానున్నాడు జాబిలీ !" అంటూ
సమాధానమిస్తాడు. అప్పుడు చంద్రకాంత 'నరులను రమ్మనవోయి త్వరత్వర' అంటూ మానవ దర్శనాభిలాషను వ్యక్తపరుస్తుంది. అట్లాగే అని రాకెట్టు

"మరల వత్తునమ్మ, తెత్తు
నమ్మ నరుని మోసికొని
సృష్టి సౌధములో క్రొత్త
తలుపు ఒకటి తీసికొని" అంటూ చంద్రకాంతవద్ద సెలవు
పుచ్చుకొని భూలోకానికి క్షేమంగా తిరిగివస్తాడు.

నిజానికి ఈ నాటిక 1959 లో రచింపబడ్డది. అంటే మానవుడు చంద్రగోళంపై వాస్తవంగా దిగడానికి ఒకదశాబ్దం ముందే చేయడం జరిగింది. అప్పటికిది కల్పన అయినా - దశాబ్దం తరువాత నిజమై కూర్చుంది. ఈ కవి క్రాంతదృష్టి కలవారని చెప్పడానికి ఇంతకన్న ఏం సాక్ష్యం కావాలి ?

చాచానెహ్రూ : నవభారతనేత నెహ్రూ బాలబాలికల ప్రేమ చూరగొన్న ఆదర్శమూర్తి. ఆయన భావితరాల పసివాళ్ళ హృదయాలలో చైతన్య జ్యోతులు వెలిగిస్తుంటాడనడంలో సందేహంలేదు. అట్లాగే ఆయన సౌందర్యారాధకుడు. గులాబీలను గుండెకద్దుకునేవాడు. నెహ్రూజీ జన్మదినం నవంబరు 14 న. ఆ రోజు బాలకోటికి పండుగ. హిమ వన్నగ శిఖరంవంటి చాచాజీ బ్రతుకులోయల్లో - వికసించే పసిపాల ఆలోచనలలో పాలుపంచుకోవడం ఈ గేయనాటికలోని ఇతివృత్తం. ముందుగా రంగురంగుల గులాబీలు నెహ్రూకోసం వెదుకుతూ రంగం మీదకు వస్తాయి.

'పాపలన్నా పూవులన్నా
పరవశమొందే తపస్వీ
ప్రజలన్నా దేశమన్నా
ప్రాణమిడే యశస్వీ ?' అంటూ.

ఇంతలోనే చెంతనున్న బాలబాలికలు చాచాజీని వెదకుతూ, గులాబీల గుండె గుబాళింపులు విని తమ భావ విపంచికను మీటుతారు.

'ఏపట్టున వెదకిన తన
రూపే కనబడదాయెను
ఎంత పిలిచినా అతని
గొంతే వినబడదాయెను'

అని నెహ్రూదర్శనానికి తహతహపడతారు. గులాబీలు, బాలబాలికలు ఆయనకై అన్వేషిస్తూ ఆవేదనా వీణను మీటుతారు.

'కనుపించవా
వినిపించవా
మాటిమాటికి వెలుగు
బాటలో పడగెత్తు
తిమిరనాగులబెడద తొలగించవా ?'

అని అప్పుడు మంచు తెరను చీల్చుకువచ్చిన ఉదయ సూర్యునివలె జవహరుడు ప్రత్యక్షమౌతాడు. ఆనందపరవశులైన బాలబాలికలు, గులాబీలు ఆత్మగీతం ఆలపిస్తారు. అప్పుడు నెహ్రూ

'నన్ను ఎందరు మరచిపోయిన
నన్ను ఎందరు విడిచిపోయిన
మరచిపోవక నన్ను తలచే
మంచి మనసుల అంచలారా !'

అని సంబోధిస్తూ మేగళాలే నాసమాధి నిగళాలు త్రెంచినవని – మీ ప్రగతి గీతాలే నన్ను నిదురలేపినవని ఆనందార్ద్రనయనుడై ఆపసిహృదయాలపై అమృతవాక్ శీకరాలు చల్లుతాడు. దేశపురోభివృద్ధికి బాలబాలికలను ప్రోత్సహిస్తాడు.

'పారతంత్ర్యమును ఏరూ
పమున నున్న చీల్చండి
కులమతనిర్మితవిభేద
కుడ్యాలను కూల్చండి
భారతసౌభాగ్యగీతి
హారతిగా పట్టనిచో
నాపుట్టినదినమున మీ
రేపండుగ చేయకండి'

ఆ ప్రోత్సాహాన్ని అందుకొని బాలబాలికలు, గులాబీలు అతని జీవితాదర్శాన్ని స్మరించుకుంటూ ఆశాగీతం ఆలపిస్తారు.

'నీవే భరతావనివై
భరదావనియే నీవై
వెలిగే చాచానెహ్రూ
వెలిగించు యుగయుగాలు' అంటూ.

పచ్చని విప్లవాలు పండేబాటలో, ప్రగతికి దీపం పెట్టిన దేశంలో– శాంతికి సమతకు నాందిపలికి, మార్పుకోసం మహాప్రస్థానం గావించిన మహామనీషి నెహ్రూకు పట్టిన గేయ కర్పూర హారతి ఈనాటిక !

యన్. జీ. వో. : యన్.జి.వో. ప్రభుత్వయంత్రాంగానికిపునాది. అతని జీవితం సామాన్యుని పేదరికంలో అంతర్భాగం. అటు ఆఫీసులో, ఇటు ఇంటిలో మనశ్శాంతిలేక మథనపడే అతని నిత్యజీవిత సంక్షిప్తరూపాన్ని కళాత్మకంగా చిత్రించడానికి చేసిన ప్రయత్నమే ఈగేయరూపకం !

యన్. జీ. వో. హడావుడిగా ఆఫీసుకు వచ్చి భయము,వినయము వదనంలో ప్రదర్శిస్తూ ఆఫీసరుగదిలోకి వస్తాడు. ఆ ఆఫీసరు తన చేతిగడియారంలోకి పదేపదే చూస్తూ-యన్. జీ. వో. మీదికి తన అధికార బాణాలు విసురుతాడు.

'పదిన్నరకు ఆఫీసు
పదికే రమ్మన్నాను
అదీ లేదు ఇదీ లేదు
పదకొండైపోయింది
ఉద్యోగం చేయాలని
ఉద్దేశ్యం లేదా ?
ఎంత చెప్పినా నీకు
సుంతైనా మతి లేదా ?'

అని మందలిస్తాడు. ఆ యన్.జీ.వో.తడపడుతూ సంజాయిషీ చెపుతాడు.

'ఏమని చెప్పాలండీ
ఇలా అడిగితే మీరు
ఏమి చెప్పినా సిల్లీ
ఎక్స్‌క్యూజ్ అంటారు' అని.

నిజానికి యన్. జీ. వో. సుబ్బారావు చెప్పిన మాటల్లో యథార్థం లేకపోలేదు. ఆకలి నూకలకు క్యూలో నించోడం, ఏడాదిపాపకు జ్వర మొస్తే హాస్పటల్లో గంటసేపు నిరీక్షించడం, ఒకటవతేదీ అని అప్పుల వాళ్ళొచ్చి ఘాటుఘాటుగా నోటీసు లివ్వడం, వాటిని ఆతడు శిరసావ హించడం. ఇవన్నీ సుబ్బారావు ఎదుర్కొనే సంసారసాగర కెరటాలు ! ఆ కెరటాలధ్వనిని మాటల్లో మీటుతూ ఆతడు అటెండన్సురిజిష్టరులో సంతకం చేయ్యబోతాడు. మళ్ళీ ఆఫీసరు మరోబాణం విసురుతాడు.

'పి. ఆర్.లు పెట్టలేదు
పెండెన్సీ తగ్గలేదు
పెట్టుమన్నరీతి నోటు
పెట్టమంటె చేతగాదు' అని.

అన్నింటికీ 'సారీ' అని భయభక్తులు ప్రదర్శిస్తూ నిస్సహాయంగా వెళ్ళి పోతాడు సుబ్బారావు. సాయంత్రం విసిగిపోయి ఇంటికివస్తే-ఇంటిదగ్గర ఇల్లాలు

'ఏమండీ! వచ్చారా
యన్. జీ. వో. గారూ
వచ్చి కూరుచున్నారు
మీ అప్పులవారు' అంటూ' శుభవర్తమానం' చెబుతుంది.
'ఈసంసారం నేను
ఇంక చేయలేనయ్యా!
తరగకుండ పెరిగే ఈ
బరువు మోయలేనయ్యా!' అంటూ కోపం ప్రకటిస్తుంది.

యన్ జీవో సుబ్బారావు తెచ్చినజీతం ఆమెచేతుల్లో పెట్టి ఉద్యోగ వేదాంత సారం వినిపిస్తాడు.

'పిల్లలు పుట్టినరీతి
పుట్టవు ఉద్యోగాలు
పిల్లలు పెరిగిన మాదిరి
పెరగవు మా జీతాలు' అని.

అతడివేదాంతాన్ని వినక అతడిభార్య కొరడాకొసల్లాంటి మాటలు విసురు తుంది. ఏంచెయ్యాలో, తనబాధను ఎలాచెప్పాలో తెలియని దోలాయ మానస్థితిలో యన్ జీ వో సుబ్బారావు గదినుండి బయటకు వెడతాడు. గతుకుల బ్రతుకును ఏకాంతలో తలపోసుకొనిమౌనవేదననుఅనుభవిస్తాడు.

'వేమన్నకు రామన్నకు
వినా ఎవరికీ తెలియదు
నాబాధలు నాగాథలు
నరకమైన సహించుదు" అంటూ నిట్టూరుస్తాడు. ఇంతలో ఆతడి పిల్లలు అల్లరిచేస్తూ వచ్చి బాధాతప్తుడైన నాన్నను చూచి హఠాత్తుగా స్తంభించి పోయినా, అమాయకతతో వాళ్ళ నాన్నను పలుకరిస్తారు.

'నిన్నెవ రేమన్నన్నారా
కన్నీరెందుకు మానాన్నా
అదిరి బెదిది చూస్తున్నావు
ఏదో కలగంటున్నావు'అని ఈలోగా యన్‌జీవో భార్య తాను చేసిన పొర పాటు గ్రహించి జాలిగొంతుకతో భర్తను అనునయిస్తుంది.

"ఇంటిలోని గొడవలతో
చంటి వాళ్ళ అల్లరితో
వేగలేక మీ మీద
విరుచుక పడ్డాను" అంటూ ప్రేమగా పలుకుతుంది. భార్య మాటలతో యన్ జీ వో హృదయం ప్రసన్న మౌతుంది. భావిలో ఏదో కాంతిరేఖ ఆహ్వానిస్తున్నట్లు ఆతని ముఖంమీద చిరునవ్వు వెలుగుతుంది.

"బ్రతుకు బాధ చూచి నీవు
భయపడకో భాయీ
కలదా ఎవ్వరికైనా
కలత లేని హాయి?" అంటూ నేపథ్యగానం వినిపిస్తుంది.

గుప్పెడు నవ్వులు, దోసెడు కన్నీళ్ళు, రవ్వంత ఆశ, కొండంత నిరాశ, దూరంగా చిరుకిరణం, చుట్టూ చిమ్మచీకటి ఇదీ యన్ జీ వో జీవితం ! ఆ జీవిత హృదయ వాటిక ఈ గేయ నాటిక !

8)

ఏఇతివృత్తాన్ని స్వీకరించినా అనుభవంతో తడిపి, ఆర్ద్రితతో పులిమి స్వచ్ఛంగా ఆవిష్కరించడం బాపురెడ్డినైజం. ఈ నిజానికి నిదర్శనం ఈగేయనాటికలు. ఋతురాగాన్ని పలికిన వీరే, యన్ జీవోను ప్రదర్శించారు. ఋతురాగంలో సరిగమలు, యన్ జీవోలో పదనిసలు మీరు విన్నారుగా! మెదటిది లలితభావ విన్యాసం, రెండవది మధ్యతరగతి మందహాసం! ఈరెండూ రెండుచేతులా పలికించడం రెడ్డిగారి సవ్య సాచిత్వానికి-నవ్యసాహిత్య కల్పనారమ్యత్వానికి సాక్ష్యం!

## 'కవితా తత్త్వాన్ని దార్శనికత్వాన్నీ ఆవిష్కరించిన భావచిత్రాలు'

# బాపురెడ్డి 'అనంత సత్యాలు'

మంచి కవిత కష్టాలను మరిపిస్తుంది. మనస్సును మురిపిస్తుంది. బ్రతుకుపై ఆశను కలిగిస్తుంది. భవిష్యత్తుకు బంగారు త్రోవలను నిర్మిస్తుంది. ఒకసారి తండ్రిగా, మరోసారి తల్లిగా-స్నేహితుడిగా, సోదరుడిగా ప్రేయసిగా కవిత అవతారాలు దాలుస్తూ, అవసరాన్ననుసరించి కన్నెర్ర చేస్తుంది. గుండెకు హత్తుకుంటుంది, హితవు బోధిస్తుంది, మధురమైన సుఖాల స్వర్గంలో విహరింప చేస్తుంది. బహుశా ర్థసాధని కవిత. స్వర్గాన్ని నిశ్శబ్దంగా చూపించే ఆమని కవిత !

కవితను నిర్వచించడం కష్టం. మనకు తోచినట్లు నిర్వచించి ఆ నిర్వచనానికి కవిత కట్టుబడి ఉండాలని ఆదేశించడం అవివేకం కూడా ! ఎగిరేపక్షిని, పాడేకోకిలను, ఆడే నెమలిని బంధిస్తే రాక్షసత్వ మౌతుంది. వాటి సౌందర్యానికి, మాధుర్యానికి సంతసిస్తే రసజ్ఞత ఔతుంది. రాక్షసత్వం పెచ్చుపెరిగే వేళ - కవిత విలపిస్తుంది. రసజ్ఞత పరిమళించే వేళ - కవిత వికసిస్తుంది.

ఆర్ద్రత, రసజ్ఞత కవితకు కావాలి ! ఈ రెండూ కవితకు లభించిననాడు ఎన్నో రంగులతో అది దర్శన మిస్తుంది. ఎటు చూచినా క్రొత్తవర్ణం, సరిక్రొత్తభావం ! ఆ వర్ణానికి భావానికి వెనుక వెన్నెల బట్టలతో తెల్లగా నవ్వే కవిత.చేవిన వాత్సల్యంలో నిండుగానవ్వే కవిత!

కవియొక్క సత్తాపై కవితరూపు ఆధారపడి ఉంది. భరత నాట్యం చేసినా, క్యాబరేడ్యాన్సు చేసినా కవియొక్క ఇష్టాన్నిబట్టే !

అందంగా నవ్వినా, వికృతంగా ఏడ్చినా దానికి బాధ్యుడు కవే ! కవి యొక్క సంస్కారం కవితపై తప్పక పడుతుంది. ఒక కవితను పఠించి, దానిని రచించిన కవిని మనం అంచనా కట్టవచ్చు.

నేటి ఆధునిక కవిత్వరంగాన్ని పరిశీలిస్తే పేరుపొందిన కవులు ఉత్తమ, మధ్యమ కవితారీతుల్ని - పేరుకోసం తాపత్రయపడే కవులు (ఏకొందరో తప్ప) అధమ కవితారీతిని ఆశ్రయించడం గమనార్హం.

ఒకకవి కవితాశిల్పానికి మోజుపడి దానిపట్ల గౌరవంతో వ్యవహరించడం ఒకరకంపద్ధతి. అట్లాకాక ప్రముఖకవి లాల్చీకొసలు పట్టుకొని ఊరేగడం మరొక పద్ధతి. మొదటిది లౌకికపద్ధతి అయితే - రెండవది దాస్యపద్ధతి. మన పూర్వకవులు కూడా లౌకిక పద్ధతి గౌరవించేవారు. దాస్యపద్ధతిని గర్హించేవారు. చేసినకృషి కొంతైనా సొంతంగా చేస్తే సాహిత్య చరిత్ర గౌరవిస్తుంది. లేకుంటే విస్మరిస్తుంది.

ఇక కవి ఎప్పుడు పుట్టాడో విమర్శకుడూ అప్పుడే పుట్టాడు. కవితలోని సౌందర్యాన్ని రోదసి లోకి ఎగురవేసే గాలిపటం విమర్శ. విమర్శకుడి ప్రతిభను బట్టి అది ప్రయాణిస్తుంది. దారం చిక్కులు పడకుండా, గాలిపటం గమనానినికి చిక్కులేకుండా, ఎక్కడా అది చిక్కుకోకుండా ఎగురవేసే మనిషి ఎంత జాగ్రత్తపడతాడో విమర్శకుడూ అంతే ! 'కూతురి రసికత అల్లుడికి తెలుస్తుందికాని తండ్రికి తెలియదు' అన్న ప్రాచీన పండితుడివాక్యం ఈ సందర్భంలో స్మరించాలి. కవితకు కవికి ఉన్న సంబంధం తండ్రీ కూతుళ్ళ అనుబంధం. విమర్శకుడికి మాత్రం అల్లుడిహోదా !

సుందరత వాస్తవికత కవితకు రెండంచులు. ఆ అంచుల పదునును పరీక్షించి విమర్శకుడు పురోగమించాలి ! అప్పుడే కవితకు గుర్తింపు విమర్శకు రాణింపు.

ఆధునికాంధ్ర సాహిత్య రంగాన ఉత్తమ భావుకులైన కవులలో శ్రీ బాపురెడ్డి ఒకరు. పద్యాన్ని - గేయాన్ని - వచన కవితను త్రివేణిగా పొంగించే శ్రీ రెడ్డి. అందు పుట్టే విద్యుత్తును శ్రామికులకు,

సామాన్యులకు అంకితంచేసి వారి చీకటి ఎదలు వెలుగులో నవ్వేలా, వికసించేలా చెయ్యడం వారి విశ్వజనీనతకు నిదర్శనం !

ఒకేగాడిలో తిరుగుతూ అరిగిపోతున్న తెలుగుకవితను చదివీ చదివీ, విని వినీ విసుగెత్తిపోతున్న సాహితీరసజ్ఞులకు అపూర్వమైన కవిత్వపువిందు ఈ "అనంతసత్యాలు". అనాదికొసలనుండి అనంతత్వం వరకూ దృష్టిసారించి ప్రత్యక్షమైన దృశ్యాలను ఇందు అక్షరబద్ధం చేయడం జరిగింది, బాపురెడ్డి మాటల్లో చెప్పాలంటే "సత్యాలు అనంత మన్న భావస్ఫూర్తితోనే దైవత్వ మానవత్వాల రూపదర్శనం చేశాను. దైవం సత్యస్వరూపి సత్యం అనంతరూపి. అనంతసత్యారాధనమే ఈ రసానంద కావ్యం."

ఈనాటికవిత్వ రంగంలో తరచుగాభావం-భాష చేసే సమ్మె మనం దరకూ తెలిసినదే! భావమున్నచోట భాషనిలువదు, భాషఉన్నచోట భావం కుదరదు. కాని, ఈకావ్యంలో ఆరెండూ చెట్టాపట్టాలు వేసుకొని వెన్నెల విహారం చెయ్యడం మనం చూడవచ్చు.

కవిగా అవతారంగాదాల్చినవాడు ప్రతిభా,వ్యుత్పత్తినిండుగా కలిగిన వాడైయుండాలి. పిడికెడు మనస్సునుండి బ్రహ్మాండమంత కల్పనను నవ్యతను దీగుమతి చెయ్యడం ప్రతిభఅయితే, బహుగ్రంథపఠనం, బహు విషయమథనం వ్యుత్పత్తిగా మనం పేర్కొనవచ్చు.

శ్రీ బాపురెడ్డి ఈరెండూ కలిగినవారు. సుకుమారమైన భావుకత్వం సుందరమైన పదబంధం ఆయనకు దక్కినవరాలు! కవిగా ఎల్లలు ఒల్లని వారు, ఇజాలతో భుజం కలపక నిజాన్ని చెప్పేతత్వం గలవారు, సంప్రదాయాన్ని జీర్ణించుకొని ఆధునిక కవితాపథంలో పురోగమిస్తున్నవీరు సాంప్రదాయాధునికులు!

'దైవత్వం అనంతత్వం నన్ను
దహించి వేస్తున్నవి
అనుభూతుల అమృతత్వం నన్ను
అక్షరాల వెలిగిస్తున్నది

అగణిత జీవిత సత్యాలు నాలో
ఆవిష్కృత మౌతున్నవి
దేశకాలాలు నా కళ్ళకు
దివిటీలు పడుతున్నవి' (అజ్ఞానజ్ఞానం)

పైపంక్తులగర్భంలో కవితత్వాన్ని-ఆవేదనావేదాన్నిమనం దర్శించ నచ్చు. అజ్ఞానంకని పెట్టిన అద్భుతసత్యాలు రెండు. ఒకటి దైవత్వం, రెండవది అనంతత్వం. మానవనాగరికత ఎప్పుడో వికసించినా ఇప్పుదికది సాధించిన విజయా లిపి. అయితే ఆత్మజ్ఞానానికి అవతలిగట్టున నున్న దైవత్వాన్ని-పదార్థజ్ఞానానికి ఆఖరిమెట్టయిన అనంతత్వాన్ని అందుకొనే తపనతో మనిషి పెరుగుతున్నాడు. మేధస్సును పెంచుతున్నాడు.

'అగుపించే వాస్తవాల వెనుక
అనుభూతి సత్యాలను చూపిస్తాను
అగుపించని అనంతత్వంలోని
ఆనందతత్త్వాన్ని ఆవిష్కరిస్తాను'
రండి-అందరూ రండి'-అంటూ
విశ్వజనతను ఆహ్వానిస్తున్నాడు.
'ప్రయోజనం లేకపోతే
మట్టి అయినా ఒకటే
మాణిక్యమైనా ఒకటే
అన్ని సత్యాలను దర్శించు
అవసరమైన దాన్ని హర్షించు
స్పర్శించు, స్వీకరించు
అనుభవించు, ఆనందించు
అనంతత్వంలోనికి పయనించు' అంటూ
వారికికూడా అన్వేషణాపథానికి ప్రోత్సహిస్తున్నాడు.

'జీవితం మహాకావ్యం' అంటున్నారు బాపురెడ్డి.

'అనుభవించడం తప్ప
అర్థం చెప్పరానిది జీవితం
రండి చూద్దాం జీవితాన్ని
రంగురంగుల సింగిణిని,

..................

ఎక్కడపుడుతుందో తెలియని
ప్రాయేటికెరటం జీవితం
ఎక్కడ పడుతుందో తెలియని
తుహినబిందువు జీవితం (జీవితం మహాకావ్యం)

కొన్నింటికి అనుభవమేతప్ప నిర్వచన ముండదు. నిర్వచనానికి అందని అనుభవనీయమైనజీవితం మహాకావ్యమే సందేహం లేదు. బాల్య యౌవన, వృద్ధాప్యాలు-రుజా, జరా, మరణాలు- రాగద్వేషాలు, త్యాగ భోగాలు అల్లిబిల్లిగా అల్లుకున్న సుందరతరగందరగోళం ఈజీవితం.

'సంపూర్ణ ప్రశ్నలకు
సమాధానం చెప్పడానికి
సందేహాలబోనులో నిలబడ్డ
సాక్షిలాంటిది జీవితం,.

..................

జననానికి మరణం శిక్ష
మరణానికి జననం శిక్ష
ఉభయశిక్షలను తానే అనుభవించే
న్యాయమూర్తి జీతం, (జీవనగీత)

భేష్ ! జీవితాన్ని అర్థవంతంగా చిత్రించడంలో కృతకృత్యులు అయ్యారు రెడ్డి. మబ్బులా వచ్చి కురిసి వాగులా పొంగిపొరలి వారాశిలో

కలిసిపోయే వర్షబిందువువంటిజీవితాన్ని-అనుభూతిశిఖరాలనుండి ఆవలో కించిన ఈరెండుకవితలు 'నవతలు' గా భావించవచ్చు.

'మాఊరు నేర్పింది నాకు
మాటలు, ఆటలు, పాటలు
మాఊరు నేర్పింది నాకు
మమతలు, ఊహలు, ఆశలు
అమ్మ ఒడిలో కూర్చుని
చందమామ రావే అంటూ
చదువు ప్రారంభించి నపుడే
మింటికీ మంటికీ మధ్య
ఇంటికీ ఇంటికీవలె
అట్టే దూరం లేదనుకొని
ఆనందించాను., (చెలికాడు చందమామ)

తల్లిఒడిలో కూర్చొని ఊహలుచేసే పసిరోజుల్లోనే మింటికీమంటికీ మధ్య దూరంలేదని భావించడం-మొయిలుఒడిలోని చందమామను అమ్మ ఒడిలో కూర్చొని పలకరించడం-ఈవిధంగా స్నేహాన్ని పెంచుకొని ఆ చందమామద్వారా చుక్కలసంగీతాన్ని విని పరవశించడం-మమతవిలువ తెలిసున్న కవికిమాత్రమే లభ్యం. కాగా, ఈ కవికీ చంద్రునకు చెప్ప లేనన్ని పోలికలున్నాయి.

'పల్లెల కళ్ళల్లో
ఆశలుపండించే
ప్రభాహాలికులం మేము
గ్రామసీమలకంఠాలలో
క్రాంతిమల్లికామాలలు వేసే
విప్లవవైతాళికులం మేము
అందుకే
మా ఇద్దరిస్నేహం
తనివితీరనిదాహం' (పరస్పరోపమ)

'ఓనమాలు
నా చేతివ్రేళ్ళ కొనల నుండి
ఒలికి పడ్డప్పుడు
కర్రపలక మీద పరచిన
ఎర్రని ఇటుక మట్టిలో
ఇంద్రనీలాలు
ఆవిష్కృత మైనప్పుడు
పొందిన ఆనందానుభూతి
బాల్యత్వానికి మాత్రమే అందే
బ్రహ్మానుభూతి (మట్టిలో పుట్టిన అక్షరాన్ని)

అక్షర స్వరూపం తొలిసారి చక్షుర్గోచరం అయినప్పుడు కలిగిన అనుభూతిని ఈ కవితలో పొందుపరచడం జరిగింది. మట్టిలోపుట్టిన ఆ అక్షరమే మనిషిని మింటికి ఎదిగించి- అక్షయమైన జ్ఞానోపార్జనకు దోహద పడుతుంది.

మా ఊరి కొండవాగులో నేను
ఏరుకొన్న సప్తస్వరాలను
గోదావరి నాద వీణ
గొంతులో పాడించాను
తుంగభద్ర రంగత్తరంగాలను
గంగాయమునలతో ఆడించాను
గంగాయమునల
రహోగళ యుగళ గీతాలను
రైను నోట విన్నాను'. (సాహిత్య సామ్యవాదం)

రైను గాయాల గేయాలు చిందిన రక్తం అమెరికా ముఖం మీద స్వేచ్ఛారుణ రేఖగా చూస్తూ - గాలికి గట్లు లేవని, మబ్బులకు నియమిత మార్గంలేదని గమనిస్తూ - సంకుచితత్వపు అద్దాలు తీసివేస్తే

మన చక్కని చూపులకు చీలికలకంటే పోలికలే ఎక్కువ కనిపిస్తాయని భావిస్తూ - అందరిలో అన్నిటిలోని సామ్యాలను కలిపే ఉత్తమమార్గాన్ని ఎన్నుకొన్నారు బాపురెడ్డి.

'సాహిత్య సామ్యవాదిని
సాహిత్య సౌమ్యవేదిని' అని ప్రకటించుకున్నారు.
'గుండె మంటల్ని భరించలేక
గోల పెడుతున్న సూర్యుని
కిరణ రణ సంగీతాన్ని
చల్లగా శ్రుతిచేసి
సరదాగా పాడుకుంటున్నాడు
పనీ పాటూలేని చందమామ
వెన్నెల పాటలుగా
విరహ గీతాలుగా,
నీలి నిశాటౌను హాలులో
చెవులులేని నక్షత్ర శ్రోతలు
కళ్ళు మిటకరిస్తూ
పళ్ళికిలిస్తూ
మైమరచి వింటున్నారు'— (కిరణాటక సంగీతం)

"సూర్య కిరణాటక సంగీతం చంద్రగాత్రంనుంచి వింటే శ్రవణ సుభగంగా, హృదయ స్పందంగా ఉంటుందని తలతిరిగే భూగోళం కల వరిస్తూ పలవరిస్తే; నేలమీది వేన వేల భాషలు తమ తమ భేదాలు మరచి ఒకే ఒక్క తాదాత్మ్య భావ సూత్రంలో తలలూపుతున్నాయి". గొప్ప భావనతో సరిక్రొత్త దర్శనీతో ఆపాత మధురంగా సాగింది ఈ కవిత.

"భావం
భాషను తరిమేస్తున్నది
భాష
భావాన్ని వదిలేస్తున్నది—

విప్లవావేశంతో
వెర్రి ఆక్రోశంలో
విడిపోయిన భాషాభావాలు
ఒకటి నొకటి వెలివేస్తున్నవి." (భాష-భావం)

భావంలో జీవం లేదని భాష పలవరించడం, భాషలో జీవంలేదని భాష కలవరించడం - భావం తనను అనుమానించిందని భాష, భాష తనను అవమానించిందని భావం కలహించుకోవడం సత్యమే ! ఈ కలహా లను కాదని కవితయే ప్రాణమని పురోగమించే సాహితీ వేత్తలు కొందరు మాత్రమే ! అందులో బాపురెడ్డి ఒకరు.

"కలపడం
కాపురాలు నిలపడంతప్ప
కలహాల జోలికి పోని
భావాసక్త నాహృదయం
భాషానురక్త నాహృదయం'

భాషాభావాలకు రాగ రసాను బంధంవేసి అమృతాను భూతులను అక్షరాక్షర గీతులను, సాహిత్యలోకంలో వెదజల్లే స్నిగ్ధ సౌమ్యముగ్ధత్వం బాపురెడ్డి కవిజీవితం.

'చైత్రోదయ శుభవేళ
వైశాఖశైల సానువుల పంచ
నల్లని కడలి పరచిన
తెల్లని ఇసుక తివాసీలమీద
సాయంసంధ్య నన్ను
సన్మానించింది
అందాల ఆ రసరాగిణి
అనుభూతుల విందు చేసింది' (సన్మానరాగం)

సన్మానానికి తనిసిన కవిహృదయం ఆ సంధ్యకు అభినందన హస్తాలు అందించగా

'సాచిన నా అభినందన హస్తాలకు
కమ్మని కలలు కలాలు అందించింది
ఈ కడలి సిరాబుడ్డిలో వీటిని ముంచి
ఆ చుక్కలు తిరగవేస్తున్న
శూన్య గగన పుటలమీద
అమృత కావ్యాలు వ్రాసుకొమ్మంటూ
అదృశ్యమైపోయింది సంధ్య'

ఆ కలాలను అందుకొని అలల కడలి సిరాబుడ్డిలో వాటిని ముంచి నీలి గగనపుటలపై అమృత కావ్యాలు వ్రాసే యత్నంతో "అనంత సత్యాలు" పలికిన శ్రీ బాపురెడ్డి నిజంగా ధన్యులు.

కేంద్ర అకాడమీ అవార్డును అందుకోవడానికి అన్ని అర్హతలు కలిగిన ఈ ఆధునిక మహాకావ్యం ఉత్తర అమెరికా తెలుగు మిత్రులకు అంకితం కావడం హర్షనీయం.

'తెలుగుతల్లి మెడలో మళ్ళీ
మల్లెపూదండ పెరుస్తున్నది
తెలుగు జాతి చరిత్రలో తిరిగి
వెలుగువాన కురుస్తున్నది.'

